Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆటలో మాట

పంపినవారు :
సి. పద్మావతి—కర్నూలు

## ఈ సంచికలో కథలు
## వింతలు - విశేషాలు







ఇవిగాక రంగులబొమ్మకథ - శైపు చిత్రాలు - నలుమూలల నడకలు - ఫొటోశీర్షికల పోటీ - మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు

## 'చందమామ'కు ఏజంట్లు కావాలి

★

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 2-0-0 పంపుతూ వుంటే మీకు 7 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 0-10-0 లాభం వుంటుంది. పూర్తివివరాలకు వ్రాయండి.

చందమామ పబ్లికేషన్స్
వడపళని, మద్రాసు - 26

## చందాదారులకు మనవి

★

పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు. గతనెలలో చేతలేదనే కంప్లెయింటు గమనించబడవు.

మేనేజరు







MORTON

21-11-'53 తేదీన ప్రెస్ కమిషన్ సభ్యులు చందమామ కార్యాలయాన్ని సందర్శించారు. వారికిచ్చిన సన్మానంలో శ్రీయుతులు ఎస్. గోపాలన్, ఎ. ఆర్. భట్, డాక్టర్ సి. పి. రామస్వామి అయ్యర్, ఎ. డి. మణి, బి. నాగిరెడ్డి ప్రభృతులు పై చిత్రంలో ఉన్నారు

ప్రెస్సులో కమిషన్ సభ్యులు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఇది జనవరి నెల. ఈ నెలతోనే ఇంగ్లీషువారి సంవత్సరం ప్రారంభమయ్యేది. ఇది అనేక విధాల ప్రముఖమయింది. లెక్కలు వ్రాసుకోవటానికీ, వ్యవహారాలు నడుపుకోవటానికీ ఇంగ్లీషు పంచాంగం చాలా సౌకర్యం. అందుచేతనే దీనికి అవలంబన ఎక్కువగా వుంటున్నది. జనవరి నెల మనకూ ముఖ్యమయిందే. అత్యంత ఆనందదాయకమైన పెద్దపండుగ ఈ నెలలోనే. రైతుబిడ్డకు ఇదే తీరిక సమయం. రైతుతోపాటు అందరూ ఈ పండుగకు ఉత్సాహంగా వుంటారు. అదీగాక — ఈ 26 వ - తేది స్వాతంత్ర్య దినం. 30-వ తేది గాంధిమహాత్ముని స్మరించవలసిన పవిత్రదినం. తరువాత— ఇంతవరకు జరిగిన చందమామ చరిత్రను ఈ సంచికలో మీరు చూడవచ్చు. అనుకొన్నట్టుగా కొత్త సీరియల్‌ను మూడురంగులలో ముద్రించగలిగాము.

సంపుటి 14 : జనవరి 1954 : సంచిక 1








# వర మహిమ

నరులకు సుఖమూ శాంతి నొసంగే
వర మహిమలలో ఎవ్వ రధికులని
ఆదిలక్ష్మికీ శ్రీ సరస్వతికి
వాదము వచ్చిన దొకనాడు.

అంతట శ్రీసతి అవతరించి ధర
వింతగొల్పు నొక ముత్తైదువయై
కలయజూచి ఒక పేదదంపతుల
నిలయము ముంగిట నిలిచింది.

ఇంటిముందు సిరి తాండవింపగా
ఇంటివారు కడు సందడిపడుచు
వెలికి వచ్చి, యా దేవిని గాంచి
'తల్లీ! నీ వచ్చిన పని యే' మన

'వరము లీయగా వచ్చిన లక్ష్మిని
కోరుకోండిపుడె మూడు వరా' లని
ఇందిర వారల కానతీయ నా
నందము జెందుచు నా దంపతులు

'అనంత ధన మిపుడిచ్చి వెళ్ళుమా
వెనుక కోరెదము రెండో వర' మన
లక్ష్మి 'తథాస్తు'ని లక్షణమ్ముగా
అక్షయ ధనమా ఇంట గురిసి చనె.

( గేయ కథ )

ఎంటయింటిలో భోజనశాలలో
పడకటింటిలో సావడిలో
ధనము దాచుకొను నా దంపతులకు
నిద్రాహారాల్ లేకపోయెను—

పెద్దలు వచ్చిరి అప్పులకోసం
దొంగలు వచ్చిరి దోపిడికోసం
దొరలే వచ్చిరి పన్నులకోసం
ఆ దంపతు లిక అలసిపోయిరి

సుఖము లేని విశ్రాంతి లేని యీ
ధన మెందుకని లక్ష్మిని పిలిచి
రెండో వరముగ వారు కోరిరి
'ఇచ్చిన సంపద తీసుకు పొ' మ్మని.

లక్ష్మి 'తథాస్తు'ని మరి వేడుమన
కలిగినంతలో సంతృప్తిని గన
గలుగుటె సుఖమను వివేకమెపుడూ
కలుగగ, మూడో వరము కోరిరి.

'నాపని కాదది, యైనా ఇచ్చిన
మాట తప్ప' నని గర్వము వీడి,
శ్రీ సరస్వతిని ప్రార్థన సేయ
సరే 'తథాస్తు'ని వాణి పలికెను.





# అట్టమీది బొమ్మ

నారదమునివలన పంచపాండవులు 'సుందోపసుందుల' కథ విన్నట్టు చెప్పాముకద. తరువాత, పాండవులు ఒక యేర్పాటు చేసుకొన్నారు— ద్రౌపదితో ఒక్కొక్కరు ఒక్కొక్క ఏడు కాపరంచెయ్యాలి. ఆమె ఎవరింటిలో వుంటే ఆ యింటికి తక్కిన నలుగురూ పోకూడదు. ఒకవేళ వెళ్లడమే తటస్థించినట్టయితే, పన్నెండునెలలు తీర్థయాత్ర చేసుకురావటమే ప్రాయశ్చిత్తం.

ఒకరోజున ఒక బ్రాహ్మణుని ఆవులను దొంగలు తోలుకొనిపోతూవుండగా, ఆయన ధర్మరాజుండే నగరుకు దుఃఖిస్తూ వచ్చాడు. అర్జునుడు దుఃఖకారణం తెలుసుకొని, ఆ బ్రాహ్మడికి అభయమిచ్చాడు. వెంటనే అర్జునుడు తన ధనుర్బాణాలకోసం ఆయుధాగారంలోపలికి వెళ్లాడు. ఆ సమయాన ధర్మరాజూ ద్రౌపదీ అక్కడ వుండటం చూచి, అర్జునుడు చాలా విచారించాడు.

ఏమయితేనేం పోయి, దొంగలను శిక్షించి బ్రాహ్మడి గోవులను తిరుగా ఇప్పించి, అన్నగారివద్దకు వచ్చాడు అర్జునుడు. 'అన్నా!—మనం చేసుకున్న నియమాన్ని ఉల్లంఘించాను. తీర్థయాత్రపోయి వస్తా, సెలవియ్యి'అని కోరాడు.

అందుకు ధర్మరాజు 'అర్జునా! ఇది విప్రకార్యం కనుక దోషంకాదు. తీర్థయాత్ర పోవలసిన పనిలేదు' అని హితవుచెప్పాడు. ఐనా, అర్జునుడికి మనస్కరించలేదు. 'మనమే ధర్మం తప్పితే లోక మేమనుకొంటుంది. వెళ్ళే తీరతాను' అంటూ అర్జునుడు బయల్దేరాడు.

అర్జునుడు తన యాత్రలలో అనేక పుణ్యనదులలో స్నానంచేసి, దేవ తర్పణములూ పితృతర్పణములూ చేస్తూవచ్చాడు. అతను గంగానదిలో మునిగే సరికి 'ఉలూపి' అనే నాగకన్య అర్జునుడి చెయ్యిపట్టుకొని, ఇవతలకు రానీయ కుండా అతనిని నాగలోకంలో ఒక దివ్యభవనం చేర్చింది.

'ఇది ఏమి సాహసం? నీవెవ ర్తెవు? ఇది ఏ దేశం?' అంటూ అర్జునుడు ప్రశ్నించసాగాడు. అందుకామె 'నేను కౌరవ్యుడనే నాగరాజు పుత్రికను. ఈ గంగానదికి నువు వచ్చిందిమొదలు నీ పరమసుందరరూపం చూచి, నిన్నే పెళ్ళాడటానికి నిశ్చయించుకొన్నాను. కాదంటివా, నేను పరలోకానికి పోవల సిందే. కరుణించు. పుణ్యంకట్టుకో' అంటూ అర్జునుడి పాదాలు పట్టుకొన్నది. అర్జునుడు ఉలూపిని గాంధర్వవిధిగా పెళ్ళాడి ఆమెకోరిక నెరవేర్చాడు.




చంపానగరంలో పూర్వం ఒక సంపన్న బ్రాహ్మణ గృహస్థు ఉండేవాడు. అతనికి లేకలేక ఒక స్త్రీశిశువు కలిగింది. ఆమె పేరు సుభద్రాంగి. ఆ శిశువునుగురించి జ్యోతిష్కులు రెండు విషయాలు కచ్చితంగా చెప్పారు.

ఆమె పరాక్రమశాలి ఐన ఒక సార్వభౌమునికి భార్య అవుతుందనీ, ఇద్దరు పుత్రులు కలుగుతారనీ, వారిలో ఒకడు చక్రవర్తి కాబోతాడనీ, రెండవవాడు సంసారం త్యజించి సన్యాసి అవుతాడనిన్నీ.

కూతురును గురించి చెప్పిన ఈ మంచి మాటలకు ఆ బ్రాహ్మణుడు అంతులేని సంతోషం పొందాడు.

ఆమె పెరిగి పెద్దదవుతున్నకొద్దీ బ్రాహ్మణుని ఆశలు అతిశయింపసాగినై. చూడగా ఆమె అతిలోక సౌందర్యవతి. సర్వ లక్షణ సమన్విత. ఆమెకు యుక్తవయస్సు వచ్చేసరికి, బ్రాహ్మణుడు తన ఉనికి చంపా నగరంనుండి రాజధానీ నగరమైన పాటలీపుత్రానికి మార్చాడు.

అప్పుడు పాటలీపుత్రానికి ప్రభువు బిందుసారుడు. ఆయనకు ఎంతోమంది భార్యలున్నారు. అందరు భార్యలకూ బిడ్డలు పుట్టారు. పట్టమహిషికి పుట్టిన పెద్దకొడుకు పేరు 'సుషీముడు'.

పాటలీపుత్రం చేరుకొన్న బ్రాహ్మడు ఒక రోజున తన కుమార్తెను రాజు దర్శనానికి తీసుకవెళ్ళి, 'ప్రభూ!—అన్నివిధాలా తగి ఉన్నటువంటి ఈ నా కూతురును ఏలికకు సమర్పించుకొంటున్నాను. రాణిగా స్వీకరించవలిసింది' అని కోరాడు.

ఇందుకు రాజు సమ్మతించి, ఆమెను అంతఃపురానికి పంపించాడు. తక్కిన రాణులతోపాటు, సుభద్రాంగికికూడా ఒక నివాస గృహం ప్రత్యేకించారు.

పి. నన్నప్ప




మించటంవల్ల క్రమంగా రాజుకు సుభద్రాంగిమీదా, ఆమె కొడుకులిద్దరిమీదా అపేక్ష తగ్గిపోజొచ్చింది. రాజుకు అపేక్ష తగ్గటంతో సుభద్రాంగికీ, ఆమె కొడుకులకూ కష్టపు రోజులు దాపురించినై.

* * *

రాజుకు పింగళివత్సుడనే బౌద్ధభిక్షువు పైన ఎంతో భక్తి. ఒకరోజున రాజు ఆయనను ఆహ్వానించి, "ఉపాధ్యాయా!- విశాలమైన నా సామ్రాజ్యాన్ని శాసించటానికి నా తరువాత రాకొమారులలో ఎవరికి అర్హత, సమర్థత ఉన్నదో తెలుసుకోవాలి. ఇందు కోసం పరీక్షపెట్టి ఎవరు అర్హులో మీరు నిర్ణయించాలి" అన్నాడు.

నగరానికి వెలుపల ఉద్యానవనంలోని సువర్ణమండపంవద్ద రాజపుతులందరూ సమావేశం కావటానికి తగిన యేర్పాటులు జరిగినవి. రాజు వచ్చాడు. పింగళివత్సుడూ వచ్చాడు. అందరూ చేరుకొన్నారు. ఒక్క అశోకుడుమాత్రం అక్కడ కనబడలేదు. ఏమీ!—వానికి పిలుపు వెళ్ళనేలేదు.

అక్కడ సుభద్రాంగి—అశోకుని పిలిచి, 'నాయనా!-రాజకుమారులందరూ పరీక్షకు గాను సువర్ణమండపానికి వెళ్ళారు. నువు కూడా వెళ్ళడం భావ్యంకాదా!' అన్నది.

ప్రత్యేకించారే కాని, సుభద్రాంగి అక్కడ చేరినప్పటినుంచీ అంతఃపురంలో కలకలం బయల్దేరింది. తక్కిన రాణులందరికీ ఈమెపైన అసూయ కలిగి, రోజు రోజూ వృద్ధికాజొచ్చింది. వారందరూ కలసి సుభద్రాంగిపైన రాజుకు రోత కలిగేటటువంటి పరిస్థితులెన్నో కల్పించారు. వారెన్ని చేసినా, సుభద్రాంగి సుగుణాలకూ సౌందర్యానికీ మెచ్చుకొని, రాజు ఆమెను కూడా తన భార్యగా చేసుకొన్నాడు.

బిందుసారుడికి సుభద్రాంగివలన అశోకుడు, విగతశోకుడు అని ఇద్దరు కొడుకులు పుట్టారు. కాని, పరిస్థితులు విష

అందుకు పిన్నవాడు 'అమ్మా!–నన్ను చూడటానికే నాన్నగారు అసహ్యపడతారు. అటువంటప్పుడు నేను వెళ్ళి ఆయన ఎదట పడటం ఏం బాగుంటుంది?' అని తన మనసులోని బాధ వెల్లడించాడు.

ఏమైనాసరే, వెళ్ళేతీరాలెనని తల్లి పట్టు పట్టింది. తల్లి మాటను జవదాటలేక పోయాడు అశోకుడు. పసివాడు బయలుదేరేముందు తల్లి కొంచెం శాల్యాన్నం, పెరుగూ మట్టిపాత్రలో పెట్టి కట్టి యిచ్చింది.

అశోకుడు పోతూవుండగా, దారిలో మంత్రికుమారుడైన రాధాగుప్తుడు ఎదురయ్యాడు. రాధాగుప్తుడు అశోకుని క్షేమం కోరినవాడు. నేస్తుడికి ఒక వాహనం సమకూర్చి, సువర్ణమండపంలో జరగబోయే పరీక్షకు అశోకునికూడా పంపుదామని తాపత్రయపడ్డాడు. కాని, ఎంత యత్నించినా, మంచివాహనం దొరికిందికాదు.

చివరకు, రాజుగారి ఏనుగుల శాలలో ఒక ముసలి యేనుగు కనిపించగా, దానిని అశోకునికి ఇచ్చి, పరీక్షకు వెళ్ళమన్నాడు. అశోకుడు సువర్ణమండపం చేరుకునేసరికే రాజకుమారులందరూ వారివారికి ఏర్పాటు అయిన ఉచితాసనాలలో కూర్చొనివున్నారు. వారు కూర్చోగా ఒక్క చోటుకూడా పైగా




లేదు. ఇదిచూచి అశోకుడు నేలమీదనే కూర్చొన్నాడు. అశోకుడు అక్కడకు రావటంకాని, కూర్చోవటంగాని ఒక్కరూ గమనించనేలేదు. అందరూ పరీక్ష సందడిలో మునిగివున్నారాయె!

పరీక్షా సమయం వచ్చింది.

పింగళివత్సుడు, తనచుట్టూ కూర్చొనివున్న రాజకుమారుల ముఖాలన్నీ పరిశీలించి చూచాడు. అశోకుని ముఖంలో గోచరించినట్టుగా రాజలక్షణాలు మరెవ్వరి ముఖాలలోనూ కనబడలేదు. ఐతే, ఈ పిన్నవానియందు రాజుకు అయిష్టతగా వుంటున్న సంగతి ఉపాధ్యాయునికి ఎప్పుడో




తెలుసు. నిజమైన ఈ వుద్దేశం వెల్లడిస్తే, రాజుకు కోపంవస్తుంది. కనుక, నేర్పుతో నిజం వెల్లడించవలసిన పరిస్థితి యేర్పడింది, పింగళివత్సుడికి.

"ప్రభూ!-ఇప్పుడు ఇక్కడ సమావేశమైన రాజకుమారులలో ఎవరైతే శ్రేష్ఠమైన వాహనాన్ని ఎక్కివచ్చారో అతడే మీ తరువాత మగధరాజ్యానికి సార్వభౌముడవుతాడు" అని చెప్పాడు.

రాజకుమారులలో కొందరు చక్కటి గుర్రాలమీద, మరికొందరు అందమైన రథాలమీద ఎక్కి వచ్చారు. గురువుగారి మాట వినగానే, ఎవరికివారే 'నేను శ్రేష్ఠ



మైన వాహనాన్ని ఎక్కివచ్చాను కనుక నేనే రాజునవుతాను' అని వారిలోవారు అనుకొని ఉత్సాహపడ్డారు. ఎవరిమట్టుకు వారే 'నన్ను గురించే గురువుగారు ఇలా చెప్పివుంటారు' అని అనుకోసాగారు.

తన పెద్దకుమారుడైన సుషీముణ్ణి ఉద్దేశించే గురువు అలా చెప్పివుంటాడని తలచాడు రాజు. ఐనా, ఒక నిర్ణయానికి రాలేక, గురువును అభిప్రాయం అడిగాడు.

అందుకు పింగళివత్సుడు 'ప్రభూ!—ఎంత ముసలిదైనా ఏనుగుకు వుండే గౌరవం మరి ఏ వాహనానికీ లేదు. గజారోహణం అనేది సామాన్య విషయంకాదు' అన్నాడు.

ఈ సమాధానం రాజుకు తృప్తిలేకపోయింది. 'ఉపాధ్యాయా!—దయ వుంచి రాజకుమారులను మరొకసారి పరీక్షించండి' అని మళ్ళీ కోరాడు.

గురువు మళ్లీ మునుపటి విషయాలనే రెట్టించుతూ 'మహారాజా!—ఇక్కడకు వచ్చిన రాజకుమారులలో ఎవరి వాహనం, ఆసనం, భోజనం, పానీయం, భోజనపాత్ర శ్రేష్ఠమైనవో అతడే మీ తరువాత సింహాసనం అధిష్ఠిస్తాడు. సంటేహం లేదు' అని అనేక విధాల నొక్కి చెప్పాడు.



రాజుకు ఇదేమీ నచ్చలేదు, పైగా అర్థంకాలేదు కూడాను.

గురువు చెప్పిన ఈ మాటలకు రాజ కుమారులలో ఎవరికి వారు మళ్ళీ, తమ తమ వాహన, ఆసన, భోజనాదులే శ్రేష్ఠమైన వని తలచి ఉప్పొంగిపోసాగారు. ఏమీ!— వారు ఆసనాలపై ఉపయోగించేవి విలువైన వస్త్రాలు. భోజనాలు కేవలం విందు భోజ నాలే. పాత్రలు బంగారపువి. పానీయాలా రుచికరములైన ద్రాక్షాసారాయిలు!

అశోకుడి సంగతిచూస్తే-వాహనం ముసిలి ఏనుగు; ఆసనం కటిక నేల; భోజనం పెరుగూ అన్నం. భోజనపాత్ర మట్టితో చేసింది. పానీయం మామూలు మంచినీళ్లు. నిజానికి, వీటికంటె తక్కువ రాజకుమా రులు తెచ్చుకొన్నవి శ్రేష్ఠమైనవి కానేకావు. అని చెప్పి, పింగళివత్సుడు రాజువద్ద సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

బిందుసారుడికి అశోకుడంటే అయిష్టం కావటంచేత, రాజకార్యాలలో అతన్ని కలుగజేసుకోనివ్వలేదు. కాని, త్వరలోనే అశోకునికి తలవనితలంపుగా ఒక చక్కటి అవకాశం దొరికింది.

సమీపంలో ఉండే తక్షశిలా నగరంలో విప్లవం బయలుదేరింది. అశోకుడు కోరి,




తండ్రి అనుమతి పుచ్చుకొని వెళ్లి ఆ విప్లవం అణచివేశాడు. కొద్ది రోజులలోనే విజయ గౌరవంతో నగరానికి తిరిగివచ్చాడు.

బిందుసారునికి జ్యేష్ఠుడైన సుషీముడు చంచలస్వభావుడు. ఒకరోజున అతడు ముఖ్యమంత్రితో వేళాకోళమాడుతూ, మం త్రిని నెత్తిమీద కొట్టాడు. మంత్రికి చాలా కోపం వచ్చింది. 'బాబూ!—ఇంకా రాజువి కాకముందే వృద్ధులైన మంత్రులను కొట్ట టానికి మొదలెట్టావు. రాజువే అయితే, మా తలలే తీయించివేసేటట్టు ఉన్నావే. కానీ, నువు గద్దె ఎక్కకుండా నేను జాగ్రత్తపడ తాలే!' అని మనస్సులో అనుకొన్నాడు.

ఆ క్షణంనించీ ముఖ్యమంత్రి తక్కిన మంత్రివర్గంతోకూడి కుట్ర పన్నడానికి ప్రారంభించాడు. ముఖ్యమంత్రి ప్రోత్సాహం వల్లనే ఆస్థానంలో వుండే తక్కిన రాజ మంత్రులు ఐదువందలమందీ వానికి ఎదురుతిరిగారు.

ఇలా వుండగా మునుపటిలాగానే తక్షశిలలో మళ్లీ విప్లవం వచ్చింది. ఈ సారి రాజు సుషీముణ్ణి పంపించాడు. కాని సుషీముడు విప్లవం అణచలేకపోయాడు.

ఇంతలో వృద్ధుడైన బిందుసారుడికి జబ్బు చేసింది. 'అశోకుణ్ణి తక్షశిలకు పంపించి, సుషీముణ్ణి ఇక్కడికి రప్పించండి. వాడికి పట్టం కట్టాలని వుంది' అని మంత్రులతో చెప్పాడు రాజు.

ఇది మంత్రులెవ్వరికీ ఇష్టం లేదు. ఐతే, రాజుకు ఎదురుచెప్పటానికి సాహసించలేకపోయారు. 'ప్రభూ!— అశోకుడు ఇప్పుడు అస్వస్థతగా వున్నాడు. కొంచెం నిమ్మళించగానే అతన్ని అక్కడికి పంపిస్తాం' అన్నారు. మంత్రులు కుట్ర చేసి, అశోకునికి రోగివేషం వేసి, చికిత్సకు ఏర్పాట్లు చేశారు. ఇదంతా చూడగా, తన కోరిక నెరవేరలేదుకదా అని బిందుసారునికి మనోవ్యాధి ఎక్కువయింది.

మంత్రులు అప్పుడు అశోకుణ్ణి చక్కా అలంకరించి, బిందుసారుని ఎదుటికి తీసుకు వెళ్ళారు. "మహాప్రభూ!—ఇప్పటికి వీనిని సింహాసనంమీద కూర్చోబెట్టి అభిషిక్తుణ్ణి చేయండి. సుషీముడు తిరిగి రాగానే అతనినే రాజుగా చేయవచ్చు" అని వినయంగా సలహాయిచ్చారు.

రాజుకు అవసానకాలం సమీపించింది. కోపంతోనూ బాధతోనూ నోటమాటే పెకలిందికాదు. గత్యంతరం లేకపోయింది. ఆయన చివరకు అప్రియపుత్రుడైన అశోకుని తలమీద తన చేతులతో తనే కిరీటం పెట్టవలసి వచ్చింది!






### చందమామ పెట్టిన వరవడులు :

పాతపాటలు (రకరకాలు) - ఇంద్రజాలం - పిల్లల పెంపకం - విజ్ఞానంలో గమ్మత్తులు - చేసిచూడు పెద్దల చిన్నతనాలు - బదులుచెప్పు - ఒంటిగీత బొమ్మలు - చిట్టికథలు - ముగ్గులు - టైపుచిత్రాలు నేటి పాపలు : రేపటి పౌరులు - యుక్తిలెక్కలు.

### చందమామ ఇంతవరకు ప్రకటించిన కథలు :

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1—పేజి కథలు | 44 | 4—పేజి కథలు | 190 | 7—పేజి కథలు | 3 |
| 2—పేజి కథలు | 78 | 5—పేజి కథలు | 81 | 8—పేజి కథలు | 21 |
| 3—పేజి కథలు | 109 | 6—పేజి కథలు | 68 | | |

### చందమామలో వెలువడిన పెద్దకథలు (సీరియల్సు)

| | (పుటలు) | | (పుటలు) |
|---|---|---|---|
| 1. బండరాముడు .... | 24 | 9. బాలనాగమ్మ .... | 66 |
| 2. కాకమ్మక్క కథ .... | 21 | 10. గుణసుందరి .... .... | 22 |
| 3. నక్కబావ .... .... | 23 | *11. ఐదు ప్రశ్నలు .... | 40 |
| *4. తండ్రి—కొడుకులు .... | 23 | 12. విచిత్ర కవలలు .... | 143 |
| 5. వీరలక్ష్మి .... .... | 16 | 13. అపూర్వసౌధం .... | 80 |
| 6. వర్ధమానుని యాత్రలు .... | 47 | 14. రత్నకిరీటం .... | 48 |
| 7. దొంగసన్యాసి .... | 15 | 15. శబ్దవేధి .... .... | 64 |
| 8. పాపిష్టిముఖాలు .... | 23 | | |

* ఈ పెద్దకథలు పుస్తకరూపంలో వచ్చినై.

చందమామ గేయకథలు 86 ....

చందమామ అట్టలోపలి ఫొటోలు 156

### చందమామ అట్టమీది బొమ్మ (3—రంగులు)

| | | | |
|---|---|---|---|
| రకరకాలు .... | 15 | భాగవతం బొమ్మలు .... | 42 |
| రామాయణం బొమ్మలు .... | 5 | భారతం బొమ్మలు .... | 16 |

### చందమామ అట్టచివరి బొమ్మ (3—రంగులు)

కుందేలు కుటుంబం - మాంత్రికుడి కథ - గమ్మత్తుగొడుగు కథ - బుల్‌బుల్ కథ
తెల్లపిల్లి కథ - గడుగ్గాయి గంగన్న కథ ఇవిగాక ఇంకా ఎన్నో రకరకాలు....

# నలుగురు నేరస్థులు




అక్బరుఫాదుషా సన్నిధికి ఒకనాడు నలుగురు నేరస్థులను విరిచికట్టి తీసుకవచ్చారు భటులు. అందులో మొదటివాణ్ణి పిలిచి, చక్రవర్తి, "ఇది నీకు యోగ్యమైన పని కాదుసుమా!" అని మృదువుగా చెప్పి విడిచిపుచ్చాడు. రెండవవాణ్ణి గట్టిగా చీవాట్లుపెట్టి మందలించి, పంపివేశాడు. మూడోవాణ్ణి భటులచేత బలవంతంగా బయటికి నెట్టింపించాడు.

ఇక నాలుగోవాడికి చుప్పనాతికిమల్లే ముక్కూ చెవులూ చెక్కించి, తల గొరిగించి సున్నపుబొట్లు పెట్టి, గాడిదమీద ఊరేగించవలసిందని కఠినంగా అజ్ఞాపించాడు చక్రవర్తి.

ఈ తీర్పు విని సభాసదులు ఒకరిమొగం ఒకరు చూచుకొని, గుసగుసలాడుకోసాగారు. అరితేరిన న్యాయమూర్తులు సైతం తెల్లమొగాలు వేశారు.

"ఏంనేర్పు, ఏంతీర్పు! ఏంసబబు, ఏం న్యాయం!!" అని నలుగురూ నాలుగు విధాల అనుకొన్నారు.

"మా తీర్పులో మీకేమేనా సందేహాలు ఉంటే, ఉన్నదున్నట్లూ చెప్పవచ్చు, ఎంతమాత్రం బిడియపడకండి," అని అభయమిస్తూ ప్రకటించాడు చక్రవర్తి.

అప్పుడు వారందరూ చక్రవర్తి ఎదుట చేతులు జోడించి వినయవిధేయులతో "ధర్మమూర్తీ! తమ న్యాయాన్ని మేము శంకించటంలేదు. కాని, నలుగురూ ఒకేమోస్తరు నేరస్థులుకదా, ఈ నలుగురికీ శిక్ష నాలుగు విధాలుగా ఎందుకున్నదో అనే విషయం మేం గ్రహించుకో లేకపోతున్నాం," అని మనవిచేసుకొన్నారు.

ఆ నేరస్థులవెనుక ఇద్దరేసి గూఢచారులను ఏర్పాటుచేసి, ఏంజరుగుతుందో వచ్చి చెప్పమన్నాడు అందరి ఎదుటా, చక్రవర్తి.

ఎన్. వసుంధర



వెళ్ళిన గూఢచారులు మూడవరోజున వచ్చి న్యాయస్థానంలో హాజరయ్యారు. వాళ్లు తెచ్చిన సమాచారం వినటానికి సభికులందరూ కుతూహలపడుతున్నారు. అప్పుడు గూఢచారుల నాయకుడు ప్రభువుకు ఇలా మనవిచేశాడు :

"ప్రభూ!—ఏలిక మంచిమాటలతో మందలించి విడిచిపుచ్చిన మొదటవాడు గౌరవహాని భరించలేక ఇంటికి వెళుతూనే విషం తాగి మరణించాడు. గట్టిగా చీవాట్లు తిన్న రెండవవాడు ఇల్లూ వాకిలీ—తుదకు నగరంకూడా విడిచి పరారీ ఐయాడు.

చెప్పుదెబ్బలుతిన్న నేరస్థుడు నాటినుండీ పదిమందిలోకి రావటమే మానుకొని, ఉన్నాడా లేడా అన్నట్టుగా కాలక్షేపంచేస్తూ వున్నాడు.

పోతే, ఇక నాలుగవవాడి సంగతి—అంటే ముక్కూ చెవులూ కోయబడ్డవాడి సంగతే చిత్రంగా వుంది. గాడిదమీద ఊరేగింపు సంబరం జరుగుతూవుంది. ప్రజలు గుంపుగుంపులుగా మూగి వాడిని లేవిడీ కొడుతున్నారు. ఆ సందడి చూసేందుకు వాడి పెళ్ళాంకూడా యింట్లోనించి ఇవతలకు వచ్చింది. ఆమెను తన దగ్గరికి రమ్మని పిలిచి, పదిమందీ వింటూండగానే వాడు.—

"త్వరగా ఇంటికి పోయి స్నానానికి సిద్ధంచెయ్యి. ఏముంది? ఈ దుష్టుల గొడవ తీరి, ఊరేగింపు ఐపోగానే, కొంచెం సేపటిలోనే వొచ్చేస్తా!" అని అరుస్తూ చెప్పాడు.

'నీచుడికి నీతి నియమాలుగాని, సిగ్గు బిడియాలుకాని ఉండవనటానికి వీడిని మించిన తార్కాణ లేదుకదా' అని అందరూ ఆశ్చర్యపోయారు.'

ఈ వృత్తాంతం విన్న సభవారు చక్రవర్తి న్యాయకౌశలానికీ, శిక్షా విధానానికీ అబ్బురపడి, పాదుషాను వేనోళ్ళ కీర్తించారు.





# దుండగీడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు బోధిసత్వుడు, దేవతలకు అధిపతి ఐన దేవేంద్రుడుగా వుండటం తటస్థించింది.

బ్రహ్మదత్తుడు అప్పుడు మంచి నడివయసులో ఉన్నాడు. దేవుణ్ణే లెక్కచేయని బ్రహ్మదత్తుడికి మానవులనగా ఏపాటి? వయసులో ఉంటూవున్న బ్రహ్మదత్తుడికి జంతువులన్నా, మనుషులన్నా, వస్తువులన్నా అదొకవిధమైన రోతగా కనబడేది.

వయసుమీరిన జంతువులేవైనా సరే—గుర్రాలుకాని, ఏనుగులుకాని, మరేవైనా కానీ—కంటపడితే, వాటిని తరిమి తరిమి కొట్టేవాడు. పాతబడిన బళ్ళుకాని, యింకేదైనా వస్తువుకాని కనిపిస్తే ముక్కాచెక్కలుగా చేసి పారవేసేవాడు.

వయసు గడచిన మనుష్యులు—అనగా వృద్ధులు ఎదటపడితే, వాళ్ళ నెరసిన గెడ్డాలు పట్టుకు లాగేవాడు. వాళ్ళను పాత్రలు దొర్లించినట్టుగా కింద పడుకోబెట్టించి దొర్లించేవాడు. ఆ వృద్ధులు స్త్రీలయితే, నానాహింసలూ పెట్టేవాడు.

బ్రహ్మదత్తుడు చేసే ఈ అర్థంలేని ఆటలకూ, దుండగాలకూ ఒక మితీ మేరా లేకపోయింది. ఇంద్రుడి లక్ష్యమూ చంద్రుడి లక్ష్యమూ లేకుండా సంచరించే ఆ రాజకుమారుణ్ణి ఎదిరించటానికి ఎవళ్ళకూ తరం కాలేదు.

ఇలా రాజుచేసే దుర్నయాలకూ, యాతనలకూ ప్రజ కటకటలాడిపోసాగారు. చేసేది లేక, తల వంచుకొన్నారు. వృద్ధులైన తమ తలిదండ్రులను రాజ్యం దాటించి ఇతర ప్రదేశాలకు చేర్చుకొన్నారు. ఈ విధంగా తలిదండ్రులను దూరదేశాలలో దిగబెట్టి, వారికి ఎడబాపులై వుండటం తప్ప మరి గత్యంతరం లేకపోయింది.

ఇలా ప్రజ తలిదండ్రులను విడిచిపెట్టి ఉండటంవల్ల వారు మహాపాపం చేసిన వారయ్యారు. ఇటువంటి పాపాత్ములతో రౌరవాది నరకాలన్నీ నిండిపోజొచ్చినై. అటు చూడగా, స్వర్గలోకమంతా ఖాళీగా ఉండిపోయింది.

స్వర్గలోకంలో తగినంత పని కనబడక పోయేసరికి దేవేంద్రుడు తల్లడిల్లాడు. లాభమేముంది? దూరం యోచించి, ఒక పన్నాగం పన్నాడు—అది యేమిటిఅంటే:

కడు పేదఐన ఒక శతవృద్ధురూపం తాల్చాడు. రెండు జాడీలలో మజ్జిగ నింపి, శిథిలావస్థలో వుండె ఒక బండిలో పెట్టాడు. ఆ బండికి రెండు బక్కఎద్దులను పూన్చి, బయలుదేరాడు.

ఈవిధంగా దేవేంద్రుడు వెళుతూండగా- అతి వైభవంగా గొప్ప ఊరెగింపుతో గజారోహణం చెసి వస్తున్న బ్రహ్మదత్తుడు యెదురయ్యాడు. రాజుకొసం నగరమంతా ఆనాడు కలకలలాడుతూ అలంకరించబడింది!

బండీమిద ముసలివాణ్ణి చూస్తూనే రాజు "పోరా, అవతలికి. తప్పుకొరా! ఏమిటింత పొగరు?" అంటూ కేకలువేశాడు.

పక్కనున్న ప్రజకు ఇదంతా ఆశ్చర్యం కొలిపింది. 'ఏమిటీ, రాజు ఇలా కేకలు




వేస్తాడెందుకో!' అని అనుకొన్నారు. చిత్ర మేమిటంటే — మారువేషంలో వున్న ఆ దేవేంద్రుడు ఒక్క రాజుకే కనిపిస్తున్నాడు. కాని ప్రజలలో ఒక్కళ్ళకూ గోచరించటం లేదు. దేవేంద్రుడు కనబరిచిన ఈ మహిమ వల్లనే ప్రజలకళ్లకు మాయ కమ్మింది!

అలా కోపంతో కేకలువేసే రాజుమీదికి పోయి, వృద్ధుడు తన బండీలోని ఒక మజ్జిగజాడి తీసి రాజు నెత్తిమీద పగలగొట్టాడు.

భయంతో రాజు ఏనుగు దిగి చుట్టు చుట్టు తిరుగసాగాడు. అప్పుడు దేవేంద్రుడు రెండవ జాడీకూడా తీసి రాజు తలకు వేసి



కొట్టాడు. ఆ మజ్జిగ ఒలికి రాజు వళ్ళంతా తడిసిపోయింది. రాజు ఉగ్రుడయ్యాడు.

ఆ సమయంలో దేవేంద్రుడు ఎక్కి వచ్చిన, బండీ అదృశ్యమయిపోయింది. మజ్జిగ జాడీలూ కనబడకుండా పోయినై. అప్పుడు దేవేంద్రుడు స్వస్వరూపంతో రాజు ఎదుట సాక్షాత్కరించాడు.

పాపాక్రాంతుడైన రాజును చూచి దేవేంద్రుడు:

"ఏమి రాజా!—పోగరుబోతుదనము ఎవరికి, నీకా, నాకా? కన్నుకానని గర్వంతో ఎవరు మిట్టిపడుతూవుంట? నీవా, నేనా? ఎల్లప్పుడూ ఈ యౌవనంలో ఇలానే వుండి పోతావా నీవు? నీకు వృద్ధాప్యం రాదా? ముసిలివారినీ పాతవస్తువులనూ గేలి చేస్తావా? నీ దుశ్చేష్టలవల్ల రాజ్యంలో ప్రజ యెంత బాధపడుతున్నారో తెలుసుకున్నావా? నీ యాతనవల్ల వాళ్లందరూ కన్న తలిదండ్రులను దూర ప్రదేశాలకు పంపివేసి, వారి రక్షణ చూడలేని మహా పాపులవుతున్న సంగతి కొంచెమైనా గుర్తించావా? ఈవిధంగా నరకలోకాలు నిండిపోవటం, స్వర్గానికి ఒక్కళ్ళూ రాక పోవటం గమనించావా? చూడు. ఈ క్షణంనుంచిఐనా బుద్ధి తెచ్చుకొని, సరీగా ప్రవర్తించు. లేకుంటే, ఇదుగో ఈ పిడుగు వచ్చి, నీ తలనూ మొండెమునూ వేరు చేస్తుంది. జాగర్త!" అని హెచ్చరించి, అదృశ్యమయ్యాడు.

నాటినుంచీ బ్రహ్మదత్తుడి మతం పూర్తిగా మారిపోయింది. అతడు వృద్ధులను గౌరవింపసాగాడు.

అందువల్ల ఇంతకుముందు రాజ్యంలో కలిగిన అలజడి తగ్గింది. ప్రజలు వాళ్ళవాళ్ల తలిదండ్రులను మళ్ళీ ఆ దూరప్రాంతాల నుండి తిరిగి తెచ్చుకొని, సేవించి సుఖంగా ఉంటూవచ్చారు. బోధిసత్వుడి ప్రభావం వల్ల ఇంతటి మార్పు కలిగింది.




పూర్వకాలమందు కుండలినీద్వీప రాజ్యానికి చిత్రసేనుడు ప్రభువుగా ఉండేవాడు. మన కథ నడిచేనాటికి, చిత్రసేనుడు రాజ్యానికి వచ్చి రెండేళ్ళే అయింది. ఐతేయేం?- తన పరిపాలనలో ప్రజ సమస్త సౌఖ్యాలూ అనుభవించాలెననీ, తన రాజ్యం రామరాజ్యం అనిపించుకోవాలనీ ఆయనకు కుతూహలం. ఈ అభిలాషతో చిత్రసేన మహారాజు ప్రజలపై పన్నులన్నీ సగానికి సగం తగ్గించి వేశాడు.

రాజు ధర్మగుణానికి ప్రజ ఎంతగానో సంతోషించారు. పన్నుల భారం తగ్గటంతో ప్రజకు సుఖంగానే వుంది. రాజ్యంలో ఎక్కడ చూచినా చిత్రసేనుని గురించిన గాథలే! ఏమూల విన్నా ప్రభువును కీర్తించే పాటలే!! ఈ విధంగా చిత్రసేన మహారాజు ఖ్యాతి మోగిపోయింది.

బాగానే వుంది. రాజుపేరు దశదిశలా మోగిపోవడం సంతోషింపతగిందే. కాని, అటు పేరు మోగుతున్న కొద్దీ ఇటు ఖజానాలో ద్రవ్యం తరుగుతూవచ్చింది. అదే పనిగా కర్చుపెడుతూవుంటే ఎక్కడి ధనం ఆగుతుంది? ధనం లేకపోవటంచేత పరిపాలన తారుమారు కాజొచ్చింది.

మంత్రి బుద్ధిసూక్ష్మత కలవాడు. రాజు సంకల్పం గమనించేవున్నాడు. అందువల్ల రాగల ఫలితాలుకూడా ఆయనకు మొదటనే తెలుసు. అందుకనే, అవకాశం దొరికినప్పుడెల్లా రాజుతో మంచిచెడ్డలు చెబుతూనే వచ్చాడు. కాని, చూడబోతే 'నా తరంలో



సాగుతుంది? మాట తక్కని మంత్రిపదవినే నెలా నిర్వహించేది? కనుక, నాకీ బాధ్యత తప్పించవలసిందని దేవరను కోరు తున్నాను" అన్నాడు.

"అంత విషమించిందా పరిస్థితి?" అని ప్రశ్నించాడు రాజు.

"ఏమని మనవిచేసేది ప్రభూ!- అవతల ఉద్యోగులకూ ఇవతల సైనికులకూ నెల జీతా లివ్వాలి. ఇంకొక్క వారమే వ్యవధి ఉన్నది. ఖజానాలో ఉండే సొమ్ముతో నీళ్లు మోసే తోటమాలీల భత్యాలైనా సరిపెట్టలే మని తోస్తుంది." అని మనవిచేశాడు

ఇందుకు రాజు "సరే. రేపటి రోజున దర్బారు ఏర్పాటు చేయించుమంత్రీ!- మన మంత్రులే కాదు; రాజ్యంలో పెద్దమనుషు లనూ సభకు రప్పించు" అని చెప్పాడు.

మంత్రి వెళ్ళిపోయాడే కాని, రాజు మనస్సులో ఉద్దేశం ఏమిటో అర్థంకాలేదు. ధనాగారంలో డబ్బు లేకపోతే కొత్త పన్నులు విధించాలి. ఇలా దర్బారులు ఏర్పాటుచేసి అందరనూ రప్పించినంత మాత్రాన కాబోయేదేమిటి? అనుకొన్నాడు. ఏమైతేనేం, రాజాజ్ఞ! నెరవేర్చితీరాలి.

రాజ్యంలో దండోరా వేయించారు. చాటింపు విన్న ప్రజకు సంగతీ సందర్భమూ

నా ప్రజకు శాశ్వతమైన మేలుచేసి తీరాలి' అని దీక్షపట్టిన చిత్రసేనుడికి మంత్రిమాటలు చెవికెక్కలేదు. ఎన్ని విధాల చెప్పిచూచినా రాజు వినిపించుకొనక పోయేసరికి మంత్రి విసిగి వేసారిపోయాడు.

ఖజానా ఖాళీ ఐంది. పైసాఐనా నిలవ లేకపోయె. ఊరుకొంటే ముప్పు కలుగు తుందని తెలుసుకొన్నాడు మంత్రి.

ఏమైతేకానీ అని, చొరవతో ఒకనాడు ప్రభువును దర్శించి, "మహారాజా!— ఏలిక చేసిన శాసనం ప్రజకు సౌఖ్యంగానే వున్నది. ఐతే, మన ధనాగారం ఒకవంక వట్టిపోతున్నది. ధనం లేకుంటే ఏ పని



తెలియదాయె. అందుచేత, నలుగురూ నాలుగువిధాల అనుకొన్నారు. ఇంతకూ, రాజు దయామయుడని అందరకూ వెల్లడి అయేవున్నది. దీనినిబట్టి కొంతమంది 'అసలు పన్నులు మొత్తంగానే తీసివేస్తా డయ్యా, ధర్మప్రభువు!' అంటూ వదంతులు వ్యాప్తిచేయజొచ్చారు.

మేకలవంటి ప్రజ ఈ మాటలు, నిజమే నని నమ్మారు.

అనుకున్నప్రకారం మరునాడు దర్బారు ఏర్పాటయింది. మంత్రిపుంగవులూ, ముఖ్యోద్యోగులూ, రాజ్యంలో పేరుమోసిన పెద్దమనుష్యులూ వచ్చేశారు. సభ కిటకిట లాడుతూవుంది. చిత్రసేన మహారాజులుం గారుదర్బారుకు విచ్చేసి,సింహాసనం అధిష్ఠించారు. రాజుగారి ఆజ్ఞను శిరసావహించి ముఖ్యమంత్రి సభవారికి ఇలా చెప్పాడు:

"మన ప్రభువుల వంశం దయాధర్మాలకు కీర్తిగాంచింది. ప్రజను కన్నబిడ్డలలాగా చూచుకోవడం వారి వంశాచారమైవున్నది. అసలు మన రాజ్యంలో పూర్వం విధింపబడి అమలులో వుంటున్న పన్నులే నామమాత్రమైనవి. అటువంటిది, ఇప్పుడు కరుణాసింధువులని బిరుదువహించిన మన చిత్రసెనమహారాజులుంగారి హయాములో



ఆ పన్నులు సగానికి సగం తగ్గిపోయిన సంగతి అందరికీ తెలిసిందేకద! ఈ నామమాత్రపు పన్నులతో రాజ్యపాలన సాగేది ఎలా అనేది ఇప్పుడొక సమస్య ఐకూర్చుంది" అని చెబుతూవుండగా—

సభలోనుండి ఒకడు లేచి, "ప్రజల మీద పన్నులు వేయకుంటే పరిపాలన సాగనేసాగదా?" అని ప్రశ్నించాడు.

ఈ ప్రశ్నకు అక్కడ దర్బారులో అంతా విస్తుపోయారు. ముఖ్యమంత్రికి మతిపోయినంత పనిఅయింది.

అయినా, గుండె దిటవుచేసుకొని మంత్రి మళ్ళీ ఇలా ఉపన్యసించాడు: "మీరే ఆలో






చించండి—మన రాజ్యంలో జనాభా ఎంత ? అంతమందీ చల్లగా ఉండాలంటే ఎన్నెన్ని సౌకర్యాలు ఉండాలి ? ఆరోగ్యం కాపాడుకునేటందుకు మందు మాకులూ వద్దా ? పెరిగి పెద్ద కావలసిన బిడ్డలకు చదువు సంధ్య లక్కరలేదా ?—ఇంతకూ, పర రాజులు ఏ క్షణాన్నయినా మనమీదికి దాడి చేయవచ్చు. ఈ భయం లేకుండా రాజ్యం రక్షించుకునేటందుకు సైన్యం ముఖ్యం కదా ?—పన్నులు వేయక వీటన్నింటికీ ధనం ఎలా వస్తుంది? ఎక్కడినించి ఏ విధంగా డబ్బు తెచ్చి ప్రజకు సౌఖ్యాలు చేకూర్చటం? కనుక పన్నులంటే ఏమిటో,



వీటిని ఎందుకు విధించాలో తెలుసుకోవటం ప్రతి పౌరునికీ విధి..." అని చెబుతూ వుండగా, ఇంతవరకూ వింటూ కూర్చున్న చిత్రసేనుడు—

"మనమంత్రి చెప్పిన మాటలన్నీ చక్కగానే వున్నాయి. అయితే, ఒకసారి తగ్గించిన పన్నులను తిరుగా విధించినట్టయితే, మునుపటి పద్ధతిలో వసూలుచేయగలమా అనేది ప్రశ్న" అన్నాడు సంశయంతో.

సభలో గుసగుసలు బయలుదేరినై. దర్బారులో ఒకడు నిర్భయంగా లేచి—

"మహారాజా ! తగ్గించిన పన్నులు తిరుగా పెంచడమనేది చాలా ఆలోచించవలసిన సమస్య. ఇప్పటికీ ఇంకా, దేశదేశాల వ్యాపిస్తున్నటువంటి ప్రభువుల కీర్తి కాస్తా హారతికర్పూరంలాగా హరించిపోతుంది. మహీపతులు మాటతప్పడమనేది సామాన్య విషయం కాదు. ఆలోచించండి ప్రభూ ! బాగా ఆలోచించండి !!" అన్నాడు.

ఈ మాటలలో రాజుకు గొప్ప యదార్థం గోచరించింది. తను గద్దె ఎక్కినప్పటి నుంచీ ఇప్పటివరకూ ఆర్జించుకువస్తున్న యశస్సు క్షణంలో మాయమైపోతుందే ! కనుక, తగ్గించిన పన్నులు పెంచటానికి ఎంతమాత్రం వీలులేదు. వేరు మార్గాలు





వెతకవలసిందే అని నిశ్చయించుకొన్నాడు రాజు. "ఒకసారి చేసిన నిర్ణయాన్ని మేము మార్చబోము. తగ్గించిన పన్నులను పెంచేది లేదు. కొత్త పన్నులను విధించడమనేది లేదు. మా నిర్ణయం తెలిసిందికద? పైగా, పరిస్థితులన్నీ వెల్లడించేవున్నాడుకద మంత్రి ? — ఇప్పుడు చెప్పండి ఏదైనా ఉపాయం" అన్నాడు రాజు.

దర్బారంతా నిశ్శబ్దమైపోయింది! ఒకరి ముఖం ఒకరు చూచుకొనటమే కాని, ఏం జవాబు చెప్పాలో ఒకళ్లకూ ఏమీ తోచిందికాదు. ఈ సమయంలో, సేనాధిపతి ఐన సమరసేనుడు లేచి—

"మహాప్రభూ!—ధనాగారం నింపడమనేది అదొక పెద్ద సమస్య కానేకాదు. ఆ మార్గాంతరం నే చెప్పగలను. ఐతే—అది చాలా గుప్తవిషయం. అందుచేత, రహస్యంగా మనవిచేసుకొంటా" అన్నాడు.

సరే. రాత్రి పదిగంటలప్పుడు ఏకాంతంగా ఉద్యానవనంలో, మహారాజును సేనాధిపతి దర్శించాలెనని ఏర్పాటు జరిగింది.

సేనాధిపతి నోటినుండి వెలువడ్డ మాటలు చెవినిపడగానే, దర్బారులో ప్రతిఒక్కరూ జిజ్ఞాసలో పడ్డారు—ఏమిటైవుంటుందా ఈ దేవరహస్యం అని. ఐనా, రేపు ఈపాటికి




అంతా వెల్లడిఅవుతుందికదా అనే తృప్తితో వారు సరిపెట్టుకొన్నారు.

అన్నట్టుగానే—రాత్రి సరీగా పదిగంటలకు సమరసేనుడు వెళ్ళి ఉద్యానవనంలో మహారాజును దర్శించాడు.

"ప్రభూ!—మన ధనాగారం నిండాలంటే ఇంత యోచన ఎందుకు ? మన రాజ్యంలో ఒక్క పైసా ఐనా అదనంగా వసూలయే దారి లేదు. ధనసంపాదన ఎలాగ ? ప్రజను సుఖపెట్టి మనరాజ్యం రామరాజ్యం అనే ఖ్యాతి నిలబెట్టుకోవటం ఎలాగ ?—ఇదికద సమస్య ? ఇందుకు ఒక్కటేఒక్క మార్గం కనబడుతున్నది.





"పరరాజ్యాలమీద దాడిచేసి వాళ్ల ధనాగారాలను కొల్లగొడితే సరి! ఇది రాజధర్మం కదా మహాప్రభూ! — ఇందుకోసమేకద, సైన్యాలూ సేనాధిపతులున్ను పోషింపబడేది?" అని విన్నవించుకున్నాడు.

"సమరసేనా!—బాగానే వుంది నువు చెప్పిన వుపాయం. అసలు మన రాజ్యమే ఒక ద్వీపమయింది! మనకు అన్నివైపులా సముద్రాలేకద! ఈ సముద్రాలన్నీ దాటుకొని, పొరుగురాజ్యాలమీద దాడిచేయాలంటే మనకు యెంత నౌకాబలం, యెంత సైనికబలం కావలసివుంటుంది?—ఆలోచించావా?" అని ప్రశ్నించాడు రాజు.



"ఈ రెండు విషయాలూ నాకు వదలండి దేవరా!" అన్నాడు సేనాని.

"సరే. ఈ బాధ్యతఅంతా నీదే. సైన్యాన్ని సమకూర్చాలంటే నీమాట ప్రభుత్వాజ్ఞగా పాటించాలికద, ప్రజ. అందుకోసం ఇదుగో ఈ రాజముద్రిక ఉపయోగించుకో" అంటూ తన వేలి ఉంగరం తీసియిచ్చాడు రాజు.

సెలవు తీసుకొని వెళ్లాడు సేనాని. సైనికులలో ముఖ్యులను సమావేశపరిచి, జరిగిన సంగతిఅంతా వివరిస్తూ, సంవేహించాడు. ఇది చూచి, సైనికులు ప్రశ్నించారు.

అందుకు సేనాధిపతి "మరేమీ లేదు. సముద్రాలు దాటిపోయి, తక్కిన ద్వీపాల మీద మనం దాడిచేసేది కేవలమూ వాళ్ళ ధనాగారాలను కొల్లగొట్టుకు రావటానికేగాని, వాటిని ఆక్రమించుకొని పరిపాలించేందుకు కాదుకదా! ఈమాత్రం పనికి యిప్పుడున్న మన సైన్యాలు చాలవా? అని. మరొక విషయంయేమిటంటే—మనం సైన్యాలను తరలించుకొని ఈ కుండలినీ ద్వీపాన్ని వదలిపోగానే, అదును చూచి, ఒకవేళ ప్రజ తిరుగుబాటు చేస్తారేమో! అప్పుడు రాజునూ రాజబంధువులనూ రక్షించేది ఎవరు?" అన్నాడు. వెంటనే సభనుండి లేచి, 'ఇది గడ్డుసమస్యే' అన్నాడు ఒకడు.








'సైన్యం లేని రాజుకు భయం తప్పదు' అన్నాడు మరిఒకడు.

ఇంకొక సైనికుడు — వయసు మీరిన వాడు—"సేనానీ! కుండలినీదేవి కరుణవల్ల ఒక చక్కటి ఉపాయం తట్టింది" అన్నాడు. గిరుక్కుమని అంతా అతనికేసి చూడగా, ఆ సైనికుడు:

"చూడండి—దేశంలో విప్లవం లేవదీయాలంటే యువకులే కావాలి. కనుక, ప్రతి యువకుణ్ణీ యేదోవిధంగా ఆకర్షించి సైన్యంలో చేర్చుకుందాం" అని చెప్పి, వూరుకున్నాడు.

అందరకూ ఈ ఉపాయం నచ్చింది. అప్పటికప్పుడే రాజ్యంలో-పదిహేను, నలభై ఏళ్ల మధ్య వయసువాళ్ళంతా సైన్యంలో చేరవలసిందని ప్రకటిస్తూ, అందుకు అవసరమైన ఆజ్ఞాపత్రాలు రాజ ముద్రికతో సహా తయారుచేసి వుంచారు.

మరునాటినుంచీ, సైనికులు పత్రాలు చేతపుచ్చుకొని పోయి, ప్రతి గ్రామంలోనూ వయసులో వున్న ప్రతిపురుషుణ్ణీ సైన్యంలో చేర్పసాగారు. ఐతే, చేరటానికి కొంతమంది ఇష్టపడలేదు. 'కావాలంటే మీరు కోరు కొన్న పన్నులు ఇచ్చుకొంటాంగాని, బల వంతాన మమ్మలిని సైన్యంలో చేర్చవద్దు. మమ్మల్ని తలిదండ్రులనుండీ, ఆలుబిడ్డల నుండీ, ఎడబాపులు కానీయవద్దు..." అంటూ ఏమేమో గోలచేయసాగారు. కాని వినే నాథుడెవరు?

ఇష్టపడి సైన్యంలో చేరినవాళ్లు మర్యాదగా వెంటవెళ్ళారు. లేనివాళ్లను కాళ్ళూ చేతులూ కట్టి, డోలీలలో పడవేసి మోసుక పోయారు సైనికులు.

ఈ స్థితిలో ప్రజలంతా రాజువద్దకు పోయి మొరపెట్టుకొన్నారు.

ఇందుకు రాజు—'నా ఘనకీర్తిని వేనోళ్ల చాటుతూ మీలో కొందరు నాపైన కథలు రాసి కావ్యాలు అల్లివున్నారు కదా! ఇప్పుడు



మళ్ళీ పన్నులు పెంచినట్టయితే, తిరుగా మీరు నాపైన తిట్టుకవిత్వాలు కట్టటానికి అవకాశమున్నది. కనుక, చేయగలిగింది ఏమీ లేదు. ఆడితప్పటం మాకు వంశాచారంకాదు" అని చెప్పాడు.

సైన్యసమీకరణ పూర్తిఐంది. ఒక శుభముహూర్తాన కుండలినీ సైన్యాలు ఓడ లెక్కినయి.

తీరా, 'బయలుదేరవచ్చు!' అని మహారాజు అనుజ్ఞ ఇచ్చేసరికి, ఆకాశం మీద దక్షిణదిశను, మహావేగంతో కదులుతూ ప్రకాశిస్తూవున్న ఒక తోకచుక్కకంటబడింది. ఇదిచూచి అందరూ భయంతో కంపించిపోయారు. 'అశుభం! అశుభం!!' అన్న మాటలు ప్రతిఒక్కరి నోటినుండీ అప్రయత్నంగా వెలుపడినై.

'విపరీతంగా వుంది. మరొకసుముహూర్తం ఏర్పరుద్దాం. ఇప్పటికి ప్రయాణం నిలుపు చేయించండి!' అన్నాడు ఆస్థాన దైవజ్ఞుడు. ఈ సలహాకు సేనాధిపతి మండిపడ్డాడు.

"ఎవరైనా నవ్విపోతారు, ఇటువంటి అర్థంలేని పిచ్చినమ్మకాలు వింటే! మన సైనికులా చండప్రచండులు! వారిని ఏమి చేయగలదు తోకచుక్క!" అని వ్యధికరించాడు.

చాలాదూరం చెప్పి చూచాడు దైవజ్ఞుడు. లాభం లేకపోయింది. చిత్రసేన మహారాజు కూడా సేనానివైపే మొగ్గుచూపాడు. చేసేదిలేక ఆస్థానదైవజ్ఞుడు పక్కకు తప్పుకొన్నాడు. సైనికులలో బయలుదేరిన కలకలం ఎవరూ గుర్తించలేదు. చివరకు సేనాధిపతి ఆజ్ఞప్రకారం తెరచాపలు ఎత్తారు. దక్షిణదిశను వెలిసిన తోకచుక్క వైపు చూచుకొంటూ, ఓడలన్నీ ఆ దిక్కుకే గబగబ సాగిపోయినై.

—[ ఇంకా వుంది ]





# గరుత్మంతుడి ప్రతిజ్ఞ

ఇంద్రుడు దేవతల ప్రభువు. అతడి రథసారథి మాతలి. మాతలికి గుణకేశి అని ఒక్కగానొక్క కుమార్తె. ఆమె అపురూప సౌందర్యవతి.

గుణకేశికి యుక్తవయసు రాగానే మాతలి ఆమె పెండ్లివిషయమై ఆలోచింపసాగాడు. కుమార్తె వివాహం అంత తేలికగా అయేది కాదని అతడికి తోచింది. ఏమీ? తను ఇంద్రుడి రథచోదకుడు గనక అంతరానికి తగిన అల్లుడుని తెచ్చుకోవాలని తలిచాడు.

స్వర్గలోకంలోనూ, మానవలోకంలోనూ గుణకేశికి తగిన వరుడుకోసం మాతలి గాలించాడు. తన కూతురుకు తగిన గుణగణాలూ, అందచందాలూ గల యువకుడు ఎక్కడా కనబడలేదు. విసువు పుట్టింది. చేయగలిగింది ఏమీ లేదనుకున్నాడు.

మాతలి భార్య సుధర్మ, భర్త చేతులు ముడుచుకు కూర్చోవటం సహించలేకపోయింది. అవతల కూతురుకా వయసు ముదురుతూవుండె—

"స్వర్గ, మానవలోకాల్లో అమ్మాయికి తగిన వరుడు దొరకనంతమాత్రాన యిక లోకాలే లేనట్టు ఊరుకుంటామా? ఒక్కసారి నాగలోకంలోకి వెళ్లిరండి" అని చెప్పింది సుధర్మ.

'సరే' అని మాతలి నాగలోకానికి బయలుదేరాడు. సరిగ్గా మిట్టమధ్యాహ్నపు వేళ. దారిలో నారదుడు ఎదురయ్యాడు.

"ఓహో ఇంద్రుని సారథి మాతలిలాగా వుందే!" అని పలకరించాడు.

మాతలి దాపరికంలేకుండా అంతా వివరించి చెప్పాడు. అంతా విని నారదుడు:

"ఇప్పుడు నేను వరుణదేవుడిదగ్గిరకు వెళుతున్నాను. వానలు లేక భూలోక ప్రజలందరూ గగ్గోలు పెడుతున్నారు. నువ్వు నావెంట వస్తే అక్కడెవరైనా మీ అమ్మాయికి

జి. పద్మావతి




తగిన వరుడు దొరుకుతాడేమో చూచుకో వచ్చు!" అన్నాడు.

నారదుడి వెంట బయలుదేరాడు మాతలి. ఇద్దరూ కలిసి వరుణదేవుడిదగ్గిరకు పోయారు. వరుణుడు నారదుడిద్వారా భూలోకప్రజల కష్టాలు తెలుసుకుని, నివారిస్తానని వాగ్దానంచేసి పంపాడు.

మాతలికి అక్కడ ఉన్నవారిలో ఎవరూ తన కూతురుకు తగినవాడులా కనబడలేదు. నారదుడు అక్కడినుంచి మాతలిని సరాసరి నాగలోకానికి వెంటపెట్టుకుపోయాడు. వింతలూ, విశేషాలూ చూపుతూ నారదుడు మాతలిని అక్కడ వున్న ముఖ్యులందరికీ పరిచయంచేశాడు. చివరకు ఇద్దరూ దానవులు నివసించే పాతాళానికి కూడా వెళ్ళారు.

ఆ పాతాళలోకంలో విశ్వకర్మ స్వయంగా నిర్మించిన హిరణ్యపురంలోని బంగారు, వెండి భవనాలూ — రత్నాలూ, నీలాలూ పొదగబడిన తలుపులూ, ద్వారబంధాలూ చూసేసరికి మాతలికి చాలా ఆశ్చర్యం కలిగింది.

"మీ గుణకేశికి ఈడూ జోడైనవాడు ఇక్కడ వున్న యువకుల్లో వున్నాడేమో చూసుకో!" అన్నాడు నారదుడు.

మాతలి తల పంకించి "ఇక్కడ ఇళ్లూ వాకిళ్ళూ తప్ప చూడదగినవీ, కోరదగినవీ మరేమీలేవు. ఐనా, దానవులకు మా అమ్మాయిని ఎలా యివ్వటం?" అన్నాడు.

అక్కడినుంచి నారదుడు మాతలిని వాసుకి పరిపాలించే భోగావతీ పట్టణానికి తీసుకుపోయాడు. ఆ పట్టణం ఐశ్వర్యంలో, అందంలో ఇంద్రుడు పాలించే అమరావతీ పట్టణానికి సరిపోతుంది. అక్కడ వున్న నాగముఖ్యుల్ని గురించి నారదుడు మాతలికి తెలియపరిచాడు.

"ఇక్కడివారంతా ఐశ్వర్యవంతులూ, శౌర్యవంతులునూ. వాసుకి, కర్కోటకుడు, ధనంజయుడు, తక్షకుడు—ఈపేర్లు నువ్వు

వినేవుంటావు? వీరంతా మహామహులైన కశ్యపుని సంతానం. మీ అమ్మాయికి తగిన వరుడు యిక్కడ లభ్యమయితే కావచ్చు" అన్నాడు నారదుడు.

మాతలి అక్కడ వున్న కొందరు నాగ యువకులలో ఒకనికేసి వేలు చూపుతూ—

"నారదా! నువ్వు చెప్పిందంతా బాగానే వుంది. అదుగో, అక్కడ ఆ యువకులలో మనకేసి చూస్తున్న ఆ పొడగరి యెవరు? అందచందాలలో మా గుణకేశికి ఈడు వచ్చేటట్టే వున్నాడు" అన్నాడు.




నారదుడు ఆ యువకుడికేసి చూసి—

"మాతలీ, మీ గుణకేశి అదృష్టవంతురాలోయి! ఆ యువకుడే సుముఖుడు. అతడు వామనుడికీ, ఆర్యకుడికీ కూడా మనమడు. అతని తండ్రి నాగచికురుడు. పాపం, ఈమధ్యనే గరుడుని చేతిలో హతుడయ్యాడు" అనిచెప్పాడు నారదుడు.

ఈ యువకుడికి తన కుమార్తెనివ్వటం అన్నివిధాలా మంచిదనిపించింది మాతలికి. ఆ సంబంధం కుదర్చవలసిందిగా నారదుణ్ణి కోరాడు.

వెంటనేనారదుడు మాతలిని సుముఖుడి తాతగారైన ఆర్యకుడి దగ్గరకు తీసుకుపోయాడు. పరిచయాలూ,అతిథిమర్యాదలూ అయిన తరవాత నారదుడే ఆర్యకుడితో:

"ఇంద్రుడి రథసారథి అయిన మాతలి తమతో వియ్యమందటానికి ఉవ్విళ్ళూరుతున్నాడు. ఈయనకు గుణకేశి అనే పేరు గల ఒక్కగానొక్క పుత్రిక. ఆమెను మీ మనమడైన సుముఖుడికి యివ్వాలని సంకల్పం" అన్నాడు.

నారదుడి మాటలు విన్న ఆర్యకుడికి ఆనందం, విచారంకూడా కలిగింది. దేవతల ప్రభువైన ఇంద్రుడి సారథి కుమార్తెను, తన మనమడికి చేసుకోవడం కన్న ఆర్యకుడికి కోరదగింది ఏమున్నది? కాని అతడు విచారంగా ఇలా అన్నాడు—

"మాతలి పుత్రికను మా మనమడికి వివాహంచేసుకునేటంత గొప్ప అదృష్టం కలుగుతుందని నేనెన్నడూ తలచలేదు. కాని మేమంతా చాలా విషాదపరిస్థితులలో ఉన్నాము. సుముఖుడి తండ్రిని చంపిన గరుడుడు, తిరిగీ నెలగడవకముందే సుముఖుణ్ణికూడా చంపి భక్షిస్తానని శపథం చేశాడు. వాని శపథానికి తిరుగులేదుగదా!"

ఆర్యకుడు ఇలా చెప్పగానే నారదుడూ, మాతలీ సంప్రదించుకొని సుముఖుడిని సరాసరి ఇంద్రుడివద్దకు తీసుకుపోయారు. తలవనితలంపుగా మహావిష్ణువుకూడా అక్కడనే ఉన్నాడు.

నారదుడిద్వారా విష్ణువూ, ఇంద్రుడూ సుముఖుడి వృత్తాంతం, గరుడుడి ప్రతిజ్ఞా —అంతా విన్నారు. దేవమౌని కోరికనూ, మాతలి ప్రార్థననూ కాదనలేక మహావిష్ణువు—"దేవేంద్రా!—సుముఖుడికి అమృతం ఇచ్చావంటే అతనికి కలిగిన అన్ని చిక్కులూ తొలగిపోతై" అని సలహా చెప్పాడు.

కాని, ఇంద్రుడుమాత్రం సుముఖుడికి అమృతాన్ని ఇచ్చేందుకు సమ్మతించలేదు. ఎందుచేతనంటే, మహాశక్తివంతుడూ, మహావిష్ణువుకు వాహనమూ అయిన గరుడుడి శక్తి సామర్థ్యాలు ఇంద్రుడికి తెలియనివికావు.

ఇంద్రుడు సంశయించడం కనిపెట్టి— మహావిష్ణువు "దేవతలకు అధిపతివికదా! ఎవరికైనా నువ్వు పూర్ణాయుర్దాయం ప్రసాదిస్తే కాదనగలవాడెవడు?" అన్నాడు.

మహావిష్ణువు మాటలలోని ధర్మసూక్ష్మాన్ని గ్రహించిన ఇంద్రుడు సుముఖుడిని 'చిరంజీవి వగుదువుగాక!' అని దీవించాడు.

బ్రహ్మానందభరితులైన మాతలీ, నారదుడూ, సుముఖుడూ ఆ దేవతలకు నమస్కరించి సెలవు పుచ్చుకున్నారు.

ఆటుతరువాత కొద్దికాలానికే, గుణకేశితో సుముఖుడి వివాహం అతి వైభవంగా జరిగింది.



# ముచ్చటైన మూడు టైపు చిత్రాలు



ఎం. బి. ప్రసాదరావు - గుంటూరు



కె. సుశీల - భీమవరం



డి. ఎల్. వెంకటాచలపతి - బెంగుళూరు





# రామయ వేసిన ఫలకం

అనగనగనగా ఒక ఊరు
ఆ వూరిలో ఒక యాదవుడు
మక్కువతో నొక కుక్కను పెంచెను
ఆ కుక్కయె ప్రాణం బాతనికి.

గొల్లడు ఒకనా డూరికి పోతూ
డబ్బులేక తబ్బిబ్బులు రాగా
ఇది పని కాదని ఆత డూరిలో
శెట్టిని పట్టెను గట్టిగ ఒదులుకు.

"ఏమోయ్ రామయ ఇట్లా వస్తివి?
కూర్చో, కూర్చో, ఏమిటి కావలె?"
అని షావుకారు ఆదరముతొ అడుగగ
తను వచ్చిన పని చెప్పెను గొల్లడు.

అందుకు నవ్వుతు, శెట్టి ఆతనిని
"హామీ ఏమిస్తావోయ్ రామయ
జామీ నెవరుంటారోయ్ నేస్తం?"
అని అడిగీ అడుగుటతోడనె గొల్లడు

"పంచప్రాణములు నాకీ శునకమె
అన్నమాట అందరికీ విదితమె,
కనుకను, కుక్కను కుదువ బెట్టుకొని
పైకం నర్దం"డంటూ వేడెను.

కుక్కను ఇంట్లో కట్టిపెట్టుకొని
షావుకారు డబ్బిచ్చెను వానికి.

"వస్తే నేనే వస్తా బాబూ,
లేదా పైకము పంపిస్తా.
పైకము తెచ్చినవాని పరముగా
కుక్కను పంపితె సంతోషిస్తా"

* * *

ఇలా వుండగా ఒక రాత్రి
దొంగలు దూరిరి శెట్టింట్లో.

ఎం. ఎస్. శాస్త్రి

విశ్వాసము గల ఆ కుక్క
నిశ్శేషముగా దొంగలను
పరిమార్చగ మన షావుకారుకు
ప్రాణము, పైకము దక్కినవి.

"ఓసీ శ్వానమ! గొల్లని ప్రాణమ!
అతడిందుకనే నిన్నందలమున
కూర్చుండబెట్టి పూజించున్.
నీదు విలువ నే లక్షలలో
కట్టలేను ఈ జన్మములో.
తీరిపోయె నా నేస్తుని బాకీ
పరుగున పో ఇక హాయిగ నింటికి."

సంగతులన్నీ చీటీ వ్రాసి
కుక్క మెడకు కట్టెను శెట్టి.
పరుగున వచ్చే కుక్కను చూచి
పారిపోయి వచ్చినదని తలచి
మారాలోచన లెకయె రామయ
ఘోరముగా దండించెను దానిని.

'రామా! రామా!' అంటూ శునకము
రామయువైపే చూస్తూ చూస్తూ
గిలగిల తన్నుకు వెలకిలబడగా
కానబడెను ఆ కట్టిన చీటీ.

నిలువున నీరై పోయె యాదవుడు
నివ్వెరపాటుతో నిలబడి రెల్లరు,
ఇక నే మున్నది పోనేపోయె
రామయ ప్రాణం! రామయ బ్రతుకు!

నేటికి సైతం ఆ ప్రాంతములో
నిలచివున్న దొక శ్వానమందిరం
మందిరానికి కట్టియున్నది
రామయ వేసిన ఫలకం
"విశ్వాసం గల శునకం!"








సుమారు పన్నెండువందల సంవత్సరాల క్రిందట మళయాళదేశంలో రామానుజం అనే తెలుకుల కుర్రవాడొకడు ఉండేవాడు. అతడు బాల్యంనుంచీ 'కుశాగ్రబుద్ధి' అని అనిపించుకున్నాడు.

'కుశాగ్రబుద్ధి' అంటే 'దర్భకొసకు మల్లే వాడిఅయిన బుద్ధి కలవాడు' అన్న మాట. కనుకనే అతనికి ఏ పనసఅయినా శ్లోకమైనా ఒక్కసారి వింటే కంఠతః వచ్చేసేది. ఒక్కసారి విని గ్రహించగలిగినవాణ్ణి ఏకసంథాగ్రాహి అంటారు. మన రామానుజం 'ఏకసంథాగ్రాహి' అనిపించుకొన్నాడు.

అతనికి మన దేశంలో ఉండే గొప్ప గ్రంథాలలో విషయాలన్నీ తెలుసుకోవాలని కుతూహలం కలిగింది. మనకి నాలుగు వేదాలూ; ఆరు శాస్త్రాలూ; పద్దెనిమిది పురాణాలూ ఉన్నాయి. వీటిలో ఉండే సంగతులన్నీ తెలుసుకోవాలని అనిపించింది రామానుజానికి.

కాని రామానుజానికి ఎవరూ వేదాలు చెప్పారుకాదు. ఆ కాలంలో వేదాలూ శాస్త్రాలూ ఒక్క బ్రాహ్మణులే నేర్చుకునేవారు. తక్కినవారికి అవేమిటో తెలుసుకుందామన్నా వీలు ఉండేదికాదు.

రామానుజానికి తెలివీ, ఆసక్తీ ఉండి కూడా, వెళ్ళి ఏబ్రాహ్మణ్ణీ 'నాకు వేదాలు చెప్పండి' అని ధైర్యంచేసి అడగలేకపోయేవాడు. ఎందుచేతనంటే అడిగి లాభంలేదని అతడికి తెలుసు.

వీలు లేకపోయినప్పటికీ, రామానుజానికి వేదశాస్త్రాలపైన ఆసక్తిమాత్రం పోలేదు. బ్రాహ్మణ పండితుడు ఒకాయన శిష్యులకు పనసలు చెబుతోంటే వెళ్ళి సమీపంలో ఉండి వినేవాడు. అతడు ఏకసంథాగ్రాహి గనుక ఒక్క మాటు వింటే వచ్చేసేది.

పాలంకి వెంకటరామచంద్రమూర్తి

ఈ విధంగా రామానుజం తను కోరిన పాండిత్యం అవలీలగా సంపాదించాడు.

రామానుజం వాళ్లగానుగలో నూనె ఆడి విక్రయించేవాడు. ఒకనాటి ఉదయం అతడు నువుపప్పు కడిగి శుభ్రం చెయ్యటానికని ఏటిదగ్గరకు పోతూవుంటే దారిలో బ్రాహ్మణ బాలుడొకడు అరుగుపైన కూర్చుండి ఋగ్వేదంలో ఒక పనస చదువుతున్నాడు. ఆ చదవటంలో వాడు తప్పు చదివాడు. దారిని పోతూవున్న రామానుజం ఉండబట్టలేక ఆ తప్పు దిద్దాడు.




ఆ పిల్లవాని తండ్రి విని లోపలనుండి వచ్చి రామానుజాన్ని చూచి ఆశ్చర్యపోయి, 'అబ్బీ, మావాడి పనసలో తప్పు పట్టింది నువ్వేనా ?' అన్నాడు. రామానుజం తన రహస్యం వెల్లడైనందుకు నాలుక కరుచుకొని, 'ఔను స్వామీ' అన్నాడు.

'వేదాలు నేర్చే అర్హత లేదే నీకు? ఎవరు చెప్పారు ?' అని అడిగాడు బ్రాహ్మడు.

'నాకు ఎవరూ చెప్పలేదండి. విని నేర్చుకున్నాను' అన్నాడు వాడు.

బ్రాహ్మణుడు నమ్మలేకపోయాడు. 'ఏదీ, నువ్వు నేర్చినదేదో చదువు !' అన్నాడు.

స్వరం తప్పకుండా, ఉచ్చారణదోషం లేకుండా నాలుగు వేదాలూ ఆమూలాగ్రంగా వప్పచెప్పాడు రామానుజం. అగ్రహారంలో నంబూద్రి బ్రాహ్మలందరూ చుట్టూచేరి విని నిర్ఘాంతపోయి, 'సెబాష్' అని వానిని మెచ్చుకున్నారు.

కాని ఆ మెప్పు క్రమంగా అసూయగా మారింది.

అసూయ చెడ్డది ; ఎంతటి పాపానికైనా ఒడిగట్టిస్తుంది. ఆ గ్రామమందలి పండితులంతా చేరి కుర్రవానిపైన కుట్రచేశారు.

బుద్ధి మందగించే మందొకటి తెచ్చి దాన్ని పాయసంలో కలిపి రామానుజానికి ఇచ్చారు. 'ఈ భగవత్ప్రసాదం శూద్రులకు ఇవ్వరాదు. కాని నువ్వు పండితుడవన్న




అభిమానంకొద్దీ నీకుమాత్రం మేము ఇస్తున్నాము. ఎవరితోనూ చెప్పకు' అన్నారు.

రామానుజం తనకా అదృష్టం కలిగినందుకు పొంగిపోతూ, ఆ పాయసాన్ని వెంటనే పుచ్చుకొన్నాడు.

ఆ గ్రామంలోనే నారాయణభట్టాద్రి అనే బ్రాహ్మణ విద్యార్థి ఉండేవాడు. అతనికి రామానుజం అంటే చాలాగౌరవం. నారాయణుడు రామానుజంతో నేస్తం కలిపి తరుచూ అతని గానుగవద్దకు వెళ్ళేవాడు.

ప్రసాద మనుకుని విషం తిన్న రామానుజంవద్దకు నారాయణుడు మరునాటి ఉదయమే వెళ్ళి పలకరించాడు. ఎంత ప్రయత్నించినా రామానుజానికి నోట మాట రాలేదు! పైగా, వెఱ్ఱిచూపు చూడటం ప్రారంభించాడు.

రామానుజానికి బ్రాహ్మణులవల్ల ఏదో అపచారం జరిగిందని తెలిసి నారాయణుడు వెంటనే ఒక వైద్యుణ్ణి వెంటబెట్టుకు చక్కావచ్చాడు.

వైద్యుడు ఆ విషానికి విరుగుడైన మందును వెన్నలో కలిపి రామానుజంచేత తినిపించాడు. కట్టుపడిన నోరూ, మందగించిన బుద్ధీ క్రమంగా బాగుపడి, కొంతకాలమయేసరికి పనసలూ, శ్లోకాలూ ఒక్కొక్కటే జ్ఞాపకానికొచ్చాయి రామానుజానికి.

ఇప్పుడు భట్టాద్రికీ రామానుజానికీ స్నేహం ఇంకా ఎక్కువైంది. నారాయణుడు కూడా పండితుడూ కవిన్నీ. కాని రామానుజమంత గొప్ప మేధావంతుడుకాదు. ఐతే, రామానుజం సహాయంవల్ల అతడు ఎన్నో సందేహాలు నివృత్తిచేసుకుని తన పాండిత్యాన్ని వృద్ధి చేసుకున్నాడు.

ఆ కాలంలో పండితులు గూఢంగా మాట్లాడేవారు. బాగా ఆలోచిస్తేగాని మాట అర్థమేమిటో బోధపడేదికాదు. ఒకనాడు నారాయణుడు రామానుజాన్ని 'నీ గానుగలో తయారయే నూనె శ్రేష్ఠమైనదేనా?'

అని అడిగాడు. రామానుజం నవ్వుతో, 'నావద్ద గల తైలం పది పప్పుల సారం. ఇంతకన్న శ్రేష్ఠమైన నూనె ఇంకెక్కడా నీకు లభించదు!' అన్నాడు.

నారాయణునకు రామానుజుని భావ మేమిటో ఎంత ఆలోచించినా అర్థంకాలేదు. తుద కాతడు తన ఇష్టదైవమైన విష్ణు మూర్తిని తలుచుకొని నిద్రపోయాడు.

అతనికి కలలో విష్ణువు కనిపించగా, అతడు భగవంతుణ్ణి 'రామానుజం చెప్పిన ఆ పది పప్పులూ ఏమిటి దేవా!' అని అడిగాడు. అందుకు విష్ణువు, "రామానుజుని వద్ద నాలుగు వేదాలూ, ఆరు శాస్త్రాలూ ఉన్నాయి. ఇవే ఆ 'పదిపప్పులూ'ను. వీటి సారమైన జ్ఞానమే అతనివద్ద ప్రజలకు లభించగల నూనె! ఆ తైలాన్ని త్వరగా తయారుచేసి ప్రజలకు అందజెయ్యమను" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

మెలకువ రావటంతోనే నారాయణుడు లేచివెళ్ళి రామానుజాన్ని లేపి కల వచ్చిన సంగతి చెప్పాడు. రామానుజం పొంగిపోయి నారాయణుణ్ణి కౌగిలించుకుని, 'నీమూలాన్ని నాజన్మ తరించింది. భగవంతుని ఆజ్ఞానుసారం వేదశాస్త్ర సారాన్ని ప్రజలకు అందజేస్తాను!' అన్నాడు.




వేదశాస్త్ర సారమంటే పురాణాలన్న మాట. ఆ పురాణాలను వేదవ్యాసుడనే మహర్షి సంస్కృతంలో వ్రాశాడు. కాని అవి సంస్కృతం పండితులకేగాని జనసామాన్యానికి తెలియవు. అందుచేత రామానుజం భారత భాగవత రామాయణాలను అందరకూ అర్థమయేటట్లుగా మళయాళ భాషలో రచించాడు.

ఈ రచన జరుగుతూవుండగా నారాయణ భట్టాద్రి మంచం పట్టాడు. రామానుజం అతనిని చూడటానికి వెళ్ళి, 'ఏమి వైద్యం చేయిస్తున్నావు?' అని అడిగాడు. 'అన్ని వైద్యాలూ అయాయి. దేనివల్లా గుణం

కనపడలేదు' అన్నాడు నారాయణ. 'అట్లైతే చేపతో వైద్యం ప్రారంభించు' అని చెప్పి చక్కాపోయాడు రామానుజం.

నారాయణునకు రామానుజుని మాట విన్నప్పుడు చాలా కోపం వచ్చింది. 'నన్ను చేపలు తినవలసిందని సలహా ఇస్తున్నాడే వీడు!' అనుకున్నాడు.

ఆ కోపంమూలాన నారాయణభట్టాద్రి చూడటానికి తరుచు వచ్చి వెడుతూవున్న రామానుజంతో ఇదివరకుమల్లే మనసిచ్చి మాట్లాడటం మానివేశాడు. రామానుజం ఇది గ్రహించి, 'తమ్ముడూ, నేనేమైనా నీకు కష్టం కలిగించే మాట అన్నానా? దాచక చెప్పు' అని బ్రతిమలాడాడు. నారాయణుడు ఉండబట్టలేక 'చేప' వైద్యం మాట చెప్పేడు.

రామానుజం కడుపు చెక్కలయేటట్లు నవ్వి, "తమ్ముడూ, ఇదా నీ కోపకారణం? 'చేపతో వైద్యం ప్రారంభించు' అంటే చేపలను తినమని కాదు! మనుష్యులుచేసే వైద్యాలేవీ నీ రోగాన్ని కుదర్చలేక పోయాయని గ్రహించినప్పుడు ఇంక నీకు తగిన వైద్యం దేవుణ్ణి ప్రార్థించటమే అని తోచింది నాకు. భగవంతుడుఎత్తిన పదిఅవతారాలలో మొదటిదైన మత్స్యావతారంతో ప్రారంభించి పది అవతారాలనూ స్తోత్రం చెయ్యమని సలహా ఇచ్చాను. అంతే" అన్నాడు.

నారాయణుడు తన అజ్ఞానానికి సిగ్గుపడి, నాడే రామానుజుని సలహాప్రకారం దశావతార స్తోత్రాన్ని సంస్కృత శ్లోకాలుగా రచించటం ప్రారంభించాడు. అదే నేటికి మళయాళదేశంలో 'నారాయణీయ' మనే పేరుతో పఠించబడుతోంది.

రామానుజులు మళయాళంలో రచించిన పురాణగ్రంథాలు శాశ్వతంగా నిలిచిపోయినై. ఇప్పటికీ ఆదేశంలో చాలామంది పిల్లల అక్షరాభ్యాసంనాడు, రామానుజం పుట్టిన గ్రామంనుంచి ఇసుక పట్టుకుపోయి దానిమీద ఓ న మా లు రాయిస్తారట!






# అనాగరికుడెవరు?

పూర్వం ఒకప్పుడు ఈజిప్టుదేశాన్ని మెహర్ అనే ఒక గొప్ప సుల్తాను పరిపాలించాడు.

ఉన్నదానితో తృప్తిపడక, రాజ్యాన్ని పెంచాలన్న ఆశ కలిగిందాతనికి. ఈ ఆశతో మెహర్‌సుల్తాను చుట్టుపక్కల దేశాలన్నింటినీ ఆక్రమించుకుని, ఆ రాజుల చేత కప్పాలు కట్టించుకొని, చక్రవర్తి ననిపించుకోవాలని నిశ్చయించుకొన్నాడు. వెంటనే ఖజానాలో సొమ్ము అంతా వెచ్చించి గొప్ప సేనలు పోగుచేసి విజయయాత్రసాగించాడు.

దండెత్తివచ్చిన మెహర్‌ను పౌరుషవంతులైన రాజులు కొందరు ఎదిరించారు. కాని సముద్రానికిమల్లే పొంగివచ్చిన ఈజిప్టు సేనలముందు వాళ్ళ పౌరుషం వృధాఐంది. ఆ మహావీరులు యుద్ధంలో ప్రాణాలను కోల్పోవలసి వచ్చింది. ఎదిరించి లాభం లేదని, కొందరు రాజులు సంధి చేసుకొని కప్పాలు కట్టడానికి ఒప్పుకొన్నారు.

రాజ్యాలు వశమౌతున్నకొద్దీ మెహర్‌కి దాహమెక్కువైంది. కొత్తగా వశమైన దేశాలలోని సొమ్మంతా కొల్లగొట్టి తీసుకుపోయి కొత్త సైన్యాలు పోగుచేసి కొత్తప్రాంతాలపైన ఇంకా దండయాత్రలు సాగించాడు. ఇలా దౌర్జన్యానికి గురిఐన దేశాలలో 'షికాంగూ' అనేది ఒకటి.

'షికాంగూ' కొండలతోనూ అడవులతోనూ నిండివున్న దేశం. అహంకారం కొద్దీ మెహర్ ఆ దేశాన్నికూడా ముట్టడించాడే కాని, దాని జోలికి పోకపోతేనే తీరిపోను. 'షికాంగూ'రాజు అనుచరులంతా మన దేశంలోని భిల్లులవంటి ఆటవికులు. ఏ చెట్టుమీదో, పుట్టవెనుకనో పొంచిఉండి విషంపూసిన బాణాలు ప్రయోగించి మెహర్ సేనలో చాలామంది వీరుల ప్రాణాలు తీశారు. ఏమరుపాటున రాత్రివేళ నిద్రపోతూండగా చూసి చీమలబారులకుమల్లే

కె. దండపాణి





తండోప తండాలుగా కొండదిగివచ్చి, మెహర్ సైనికులలో ఎక్కడివాళ్ళ నక్కడ నరికి పోగెట్టి పారిపోయారు.

అప్పుడు ముఖ్యసేనాని, చక్రవర్తితో 'ప్రభూ! మనమీ దండయాత్ర వదులుకుని తిరుగుదారి పట్టడం శ్రేయస్కరం. చావగా మిగిలిన సైనికులంతా స్వదేశానికి పోవాలని కోరుతున్నారు' అని మనవిచేశాడు. కాని మెహర్ ఒప్పుకోలేదు. అతనికి పట్టుదలే ప్రధానం.

'ప్రభూ! తమరు చక్రవర్తు లనిపించుకొన్నారు. నైలునదీ ప్రాంతాని కంతకూ ఏకచ్ఛత్రాధిపత్యం వహించారు! ఇంతతో అగడం మంచిది. జయించిన దేశాలను నిలబెట్టుకోగలిగితే అదే పదివేలు' అన్నాడు సేనాని.

'ఈ షికాంగూరాజ్యాన్ని వశం చేసుకోవాలి, కదలాలి. ఇంతమందిని లొంగదీసుకుని చివరికి ఒక కొండరాజుకు లొంగిపోవటమా?' అన్నాడు మెహర్.

మెహర్ ఆజ్ఞకు తిరుగు లేదు. లెక్కలేకుండా సొమ్ము వెచ్చించి కొత్తసేనలను రప్పించారు. ఆ రాజును వశం చేసుకోవాలన్న పట్టుదలేగాని రాళ్ళూ రప్పలూ తుప్పలూ తప్ప యేమీ లేని ఆ అడవులను వశం చేసుకోవటంవల్ల ఒలికే భాగ్యమేమీ లేదని మెహర్‌కు తట్టలేదు.

పట్టుదలే ప్రధానంగా, షికాంగూ రాజైన 'బెట్సూ'ను జీవాలతోకాని, చంపివేసిగాని తెచ్చి ఎదుట పెట్టినవాడికి వెయ్యి మొహిరీ లిస్తానని సైనికులను పురికొలిపాడు.

మెహర్ సైనికులు అదేపనిగా అడవిలో చొరపడి కనపడ్డ భిల్లవీరుడినల్లా వధించటం మొదలెట్టారు. భిల్లుడొక్కొక్కడూ పదేసిమందిని చంపితేగాని చావలేదు. కాని నేల ఈనినట్టుగా పుట్టుకొస్తున్న ఈజిప్టు సేనలను నెగ్గుకురావటం అసాధ్యమని అనిపించింది వాళ్ళకు.





'బెట్సూ'రాజు మొదట సంధి చేసు కుందా మనుకున్నాడుకాని, మెహర్ ఒప్పు కోడనీ, సంధికోసం వెడితే పట్టుకుని కసి కొద్దీ చిత్రవధ చేయిస్తాడనీ తెలుసు. కాబట్టి, ఈ పరిస్థితిలో యుద్ధంచేసి వీర స్వర్గం పొందటమే మేలనుకున్నాడు. ఈ నిశ్చయంతో - భిల్లులనందరినీ వెంటబెట్టు కుని ఈజిప్టు సేనలను రెండుకొండల మధ్య ఘోరంగా ఢీకొన్నాడు.

ఆ మహాయుద్ధంలో మెహర్‌కే విజయం లభించింది. భిల్లవీరుడొక్కడూ మిగలలేదు. ఐతే, మెహర్ సైన్యంలోనూ వేలాది సైని కులు ప్రాణాలను కోల్పోయారు.

'బెట్సూ యెక్కడ?' అని అడిగాడు మెహరు ఆత్రంతో.

'గాయాలతో నిండివున్న అతని కళేబరం మన సైనికుల పీనుగుల మధ్య పడివుంది ప్రభూ' అన్నాడు ఒక సేనాని. చూడాలన్న ఆసక్తితో మెహరు బయల్దేరివెళ్లాడు. అతడు చేరుకునేసరికి అక్కడ, కారునలుపు శరీ రంతో భయంగొలిపే ఆకారంతో, యెత్తయిన మనుష్యుడొకడు ఆ వేలాది పీనుగులమధ్య నలువంకలా పరికిస్తూ నిలబడి వున్నాడు.

వాణ్ణి చూడటంతోనే మెహరు, 'ఎవరు నువ్వు?' అన్నాడు.



'వీడెవడో నరమాంస భక్షకుడు. పీను గులను పీక్కు తినడానికి వచ్చాడు' అన్నాడు సేనాని.

సేనాని చెప్పిన మాట నిజమే. ఆఫ్రికా దేశపు అడవులలో మనుష్యుల మాంసం తినేవాళ్ళు ఎందరో ఉన్నారు.

మెహరు ఆ నరమాంస భక్షకునితో 'ఇంత మాంసం లభించిందికదా, ఏదో శవాన్ని తీసుకొనిపోక, అలా దిక్కుదిక్కులు చూస్తున్నావేం?' అని అడిగాడు.

'వీళ్ళనందరనూ తినడానికెవరో చంపు కొన్నారు. నాకు కావలసినది ఒక్కటే శవం. ఐనా, వారి అనుమతి తీసుకుని మరీ

తినడం ధర్మంకదా! అందుకని, ఆ చంపిన వారికోసం ఇక్కడ ఎదురుచూస్తున్నాను' అన్నాడు నల్లవాడు.

మెహర్ నవ్వి, 'వీళ్ళనందరనూ చంపించింది నేనే! కాని, తినటానికి మాత్రం కాదు' అన్నాడు.

నల్లవాడు ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ, 'తినటానికి కాకపోతే ఇంతమందినీ వృథాగా యెందుకు చంపినట్లు?' అని ఎదురుప్రశ్న వేశాడు నిర్భయంగా.

మెహర్ చక్రవర్తి సేనానితో, 'వీడు కేవలమూ అనాగరికుడు. వీడికి నచ్చేటట్టు మనం తెలియచెప్పటం అసాధ్యం' అన్నాడు.

అంతట, చక్రవర్తికి వెనుకపక్కగా యెవరో నవ్వుతూన్నట్లు అలికిడి అయింది. మెహర్ గభీమని వెనుకకు తిరిగి చూసేసరికి, అడవులలో తపస్సుచేసుకొనే ఫకీరొకడు ఎదట ప్రత్యక్షమయాడు.

'మహాత్మా, నవ్వారెందుకు?' అని అడిగాడు మెహర్ విస్మయంతో.

'సుల్తాన్! నీవు అనాగరికుడని భావించే ఈ నరమాంస భక్షకుడు ఆకలి తీర్చుకోటానికేగాని, అనవసరంగా తోడిమానవుల ప్రాణం తీయడు. నీవో? సామ్రాజ్యాన్ని వ్యాపింపచెయ్యాలనే కాంక్షతో యుద్ధాలు తలపెట్టి, లక్షలాది మానవుల ప్రాణాలు నిష్కారణంగా తీయించుతున్నావు. అవునా? ఒక్కక్షణం ఆలోచించు, ఇప్పుడు మీ ఇద్దరిలో అనాగరికు లెవరో నీకే తెలుస్తుంది!' అన్నాడు ఫకీరు పిడుగులు పడినట్టుగా పలుకుతూ.

ఫకీరు మాటలలోని సత్యాన్ని గ్రహించి మెహరు సిగ్గుతో తల వంచుకున్నాడు.

అంతేకాదు. ఆ క్షణమందు అతని మనస్సే పూర్తిగా మారిపోయింది. 'ఇక, ఈ రోజునుంచి యుద్ధమనే మాటనే తలపెట్ట' నని నిశ్చయించుకొన్నాడు.



# 'చిటారుకొమ్మమీద మిఠాయిపొట్లం!'

చిన్నపిల్లలు పాడుచుకొనే ఈ పాడుపుకథ అందరకూ తెలిసిందే. దీనికి జవాబు 'తేనెపట్టు' అని తెలివైన కుర్రవాళ్ళు చెప్పుకొంటారు. తేనెపట్టులాగానే మనకు తియ్యటి, మిఠాయిలవంటి ఫలాలను ఇచ్చే చెట్లున్నాయి. వీటిలో ముఖ్యంగా చెప్పవలసినవి ఈతచెట్లు, ఖర్జూరపుచెట్లున్ను.

తీర్థాలకు వెళ్ళినప్పుడు ఖర్జూరం తప్పకుండా కొనుక్కుంటాం. ఖర్జూరం మన దేశంలోనూ బాగా దొరుకుతుంది. ఐతే—అరేబియాదేశం ఖర్జూరానికి ప్రసిద్ధి. అరేబియా ఎడారిదేశంకదా! ఆ దేశస్థులు ఖర్జూరమూ, ఒంటెపాలూ ఆహారంగా తీసుకొని, నెలలతరబడి ఎడారిలో ప్రయాణించేస్తారట!



ఖర్జూరం పక్వానికి రావాలంటే, అది ఎంతోకాలం సూర్యకిరణాలను ఆకర్షించాలి. దీనినిబట్టే అరబ్బీభాషలో ఒక సామెతవున్నది—'ఖర్జూరానికి తల నిప్పులోనూ, కాళ్లు నీటిలోనూ ఉంటాయి' అని. అందుచేతనే ఇది ఆరోగ్య కరమైన ఫలం అంటారు.

ఖర్జూరం పిల్లలకూ పెద్దలకూ కూడా చక్కటి ఆహారవస్తువు. కండ పట్టడానికీ, కొవ్వు పెరగకుండావుండటానికీ తగిన ప్రొటీనులూ, చక్కెరా ఇందులో వున్నాయి. లోహాలూ, కాల్షియమూ రకరకాల విటమినులూ వుండటంచేత, ఎముకలు ఎదగటానికీ, రక్తం వృద్ధికావటానికీ ఎంతగానో తోడుపడుతున్నది.

ఖర్జూరం తిని, పాలు తాగితే అది పూర్తి ఆహారమవుతుందన్నమాట. గాంధీమహాత్ముడు ఖర్జూరం, మేకపాలూ తీసుకొని మంచి ఆరోగ్యం పొందినట్టు ఆయనే తన 'ఆత్మకథ'లో వ్రాశారు.

బజారులోనూ, బండిమీద వచ్చేదీ—ఖర్జూరం కొనుక్కొన్నప్పుడు, శుభ్రంగా కడిగివేసి మరీ తినాలి. ఏమంటే, దానిపైన ఈగలు వాలతాయి. రోడ్డుదుమ్ము పడుతుంది. ఇటువంటిది తింటే ఆరోగ్యం కలగటానికి బదులు ఆరోగ్యం చెడిపోవచ్చు.

# ముగ్గురు నేస్తాలు (రంగులబొమ్మ కథ) - 1

కొన్నివేల సంవత్సరాలకు పూర్వం ఈ పల్లెలూ పట్టణాలూ ఏవీ ఉండేవికావు. జంతువులూ పశుపక్ష్యాదులూ నివసించే మహారణ్యంలోనే మానవులుకూడా కలసిమెలసి నివసించేవారు.

అటువంటి ఒక కీకారణ్యంలో ఒక కుటుంబం. అనగా ఎంతోమంది కాదు—భార్యా, భర్తా, పదేళ్ల కుర్రవాడున్నూ. కుర్రవాడిపేరు కురపన్న. చాలా చురుకైనవాడు. ఆ మహారణ్యంలో వాడు చూడని జంతువుగాని, పక్షిగాని లేనే లేదు. ఆకలితో వున్న సింహం గర్జించటం-పెద్దపులి గాండ్రించటం-కోతుల కిచకిచలు-పక్షుల కిలకిలలు-ఇవన్నీ కురపన్నకు పరిచయమే. పైగా-జంతువుల భావాలూ, పక్షుల భాషలూ వాడికి బాగా తెలుసు.

ఒకరోజున వాడి తల్లీ తండ్రీ అడవికివెళ్ళారు. తండ్రి వేటాడటం, తల్లి కందమూలఫలాదులు పోగుచేసుకురావటం మామూలు. ఇవాళ అదేమో కాని, తలిదండ్రులు వెళ్లగానే కురపన్న ఒక్కడూ, గోడకు జేర్లబడి దిగాలుమని కూర్చున్నాడు. ఆకస్మికంగా గొప్ప గాలివాన వచ్చింది.

గాలివానకు అరణ్యంలో జంతుజాలమంతా కలవరపడింది. కురపన్న వుండే గుడిసెవగ్గర మానుకు ఆనుకొని నివసించే కోతీ, చెట్టుతొర్రలో నివసించే చిలుకా, చిటారుకొమ్మమీద ఉండే కోవిలా ఒక్కచోట చేరుకొన్నయి.

మూడూ ఒక్కసారిగా దిగివచ్చి కురపన్న గుడిసె చేరుకొనేసరికి, కురపన్న చూచి ఎంతో సంబరపడ్డాడు. ఏమీ ?—ఇంతవరకూ తనను పలకరించే ప్రాణి లేకపాయె ! కురపన్నతో తను వచ్చిన కారణం చెప్పింది కోతి. చిలక తన భాషలో పలికింది. కోవిలా అలానె. 'సరె మీ ముగ్గురూ వెచ్చగా ఇక్కడే వుండండి. మా నాన్నా, అమ్మా రాగానే చెప్పి. మీ సంగతి చూస్తాను' అన్నాడు.

ఈ మాటకు సంతోషంకొద్దీ కోతి, కురపన్న చెయ్యిపట్టుకు కిచకిచలాడింది. చిలుక ఉత్సాహంతో భుజంమీదికి ఎగిరివెళ్లి, చిలుకపలుకులు పలికింది. చిన్నారి కోవిల కురపన్న తలపైన ఎక్కకూర్చొని, తీయని సంగీతం పాడింది.

అంతలో బయట ఏదో అలికిడి ఐంది. భయపడ్డాడు కురపన్న. ఐనా ఏమిటో అని గుమ్మానికి కట్టివున్న యెలుగుచర్మం పక్కకు నెట్టి చూచాడు. తీరాచూస్తే!

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 మార్చినెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ జనవరి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఫిబ్రవరి నెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

మొదటి ఫోటో: ఈ త రా క | రెండవ ఫోటో: చె ఱు వు లే క

పంపినవారు: నండూరి సత్యనారాయణరావు - కొంతంగి - బెండపూడి పోస్టు (వయా) తుని. (తూ. గోదావరిజిల్లా)

బహుమతిమొత్తం రూ. 10/- ఫిబ్రవరిసంచిక వెలువడినవెంటనే పంపబడుతుంది.

# చదువుకుంటేనే చాలదు

ములుగు తిరువెంగళాచార్యులు

ఉత్తరాదినున్న వొక్క ఊరు చిన్నది
ఆ వూరిలోన పేరుగన్న బ్రాహ్మడొక్కడు
శాస్త్రములను వేదములను చాల చదివెను
ఎంతో పుణ్యమంచు యజ్ఞ మొకటి చేసెను.

బ్రాహ్మడున్న ఊరికి పదిమైళ్ళలోపున
రాజుగారి పట్నమందు రాజు కూతురు
పెండ్లి జరుగుచుండె చాల పెద్దయెత్తున
ఆ పెండ్లికి మన బ్రాహ్మణుండు వెళ్ళె చూడగా.

పెండ్లిలోన బ్రాహ్మణునకు పట్టుశాలువ
బహుమతిచ్చె రాజు చాల ప్రేమతోడను
తెల్లవారి దండిగాను పెండ్లివిందులో
భోంచేసి బ్రాహ్మణుండు బయలుదేరెను.

బయలుదేరినాడు కాని పాప మతడు
నడువలేక అడ్డుదారి ననుసరించెను
ఆ దారి అడవిలోంచి - ఐన నేమిలే
తోడు దొరకినారు వారి యూరి రైతులే.

రైతులునూ బ్రాహ్మణుడూ కొంతదూరము
కలిసి నడువ ప్రొద్దుగూకె అడవిమధ్యను
కన్నుమిన్ను కానబడదు కటికచీకటి
పోదమన్న వీలులేదు పొదలు, ముండ్లును.

అందుచేత వారు చెట్లకింద పండుకో
దలచినారు బ్రాహ్మణున్ని పిలచి రైతులూ
'పండుకోండి అయ్యగారు మీరు యిచ్చట
మేం పండుకొందు మచట చోటు చాలదిచ్చట.'

అన్న, సరే యనుచు బ్రాహ్మణుండు అక్కడే
ఒరిగె రైతువాళ్ళు మరొక చెట్టుకిందికి
పోయి పండుకొనిరి చాల ప్రొద్దుపోయెను
బాగ గుబ్బుపట్టి నిద్రపోయి రందరూ.

పెద్దదొంగ లిద్ద రర్ధరాత్రివేళను
వచ్చి బాపనయ్యవారి చుట్టుముట్టిరి
చుట్టుముట్టి వెతుక ధనము దొరకనందున
వారు శాలువానె సంగ్రహించి దారి బట్టిరి.

వెళ్ళిపోయే దొంగవాళ్ళ 'ఒరే శాలువ
మీరు అమ్ముకొందురేమొ, నాకు అమ్మివేసితే
కొనుక్కొందు నేనె, కొంత ఉంది బుట్టలో'
అనుచు వార్కి తన విభూతిబుట్ట జూపెను.

చూచి దొంగవాళ్ల బుట్టలోవి తీసుకు
పోవుచుండ రూపాయలు మ్రోగె ఖంగునా.
ఖంగుమన్న, దొంగవాళ్ళు చెల్లవనుకొని
ఆ రూపాయిలు మ్రోగించా రనుకొనె నతడు.

'ఒరే, చెల్లవని నాణెములు అనుకున్నారా !
చెల్లుతాయి ! చూసుకోండి ! చెట్టుక్రిందను
రైతువారలున్నా రింకా వారి నడిగితే
ముందు సందేహంవదులుతుంది' అనుచుచెప్పెను.

అనిన విన్నదొంగవాళ్లు అదృష్టమ్మ
పండెనంచు బాపనయ్య వదలి వెంటనే
రైతువార్ల పట్టుకొని కోరినంతగా
దోచుకొనిరి ధనము వారి ఆశ తీరగా.

# చంద్రహారం

ఒకనాటి సాయంకాలం ఒక పంతులుగారూ ఆయనవద్ద చదువుకునే పిల్లలూ పాఠాలు పూర్తిచేసుకుని, సంధ్యాదీపానికి ప్రార్థన చేసిన అనంతరం పిల్లలు పంతులుగారిని మంచి కథ చెప్ప మని అడిగారు.

"పూర్వం దండకారణ్యంలో ఒక జిత్తులమారి నక్క ఉండేది" అని గురువుగారు కథ ప్రారంభించారు.



ఒక కుర్రవాడు అడ్డువచ్చి, "మాకు కుక్కలూ నక్కలూ వద్దు. మనుషుల కథ చెప్పండి" అన్నాడు.

వెంటనే ఇంకో కుర్రవాడు "కాదు, దేవతల కథ చెప్పండి" అన్నాడు.

"నాకు మనుషుల కథే కావాలి" అన్నాడు మళ్ళీ మొదటి కుర్రాడు.

"నాకు దేవతల కథే కావాలి" అన్నాడు రెండోవాడు.

గురువుగారు వారిని సర్ది, "అలాగైతే, మనుషులూ దేవతలూ కూడా ఉండే కథ చెబుతాను. శ్రద్ధగా వినండి" అంటూ ఈ విధంగా కథ చెప్పారు:

పూర్వం చందనదేశాన్ని చంద్రచూడుడనే మహారాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయనకు కొడుకులు లేరు. ఆశాదేవి అని ఒక

కుమార్తెమాత్రం ఉన్నది. రాజు వానప్రస్థం పోదలచి, రాజ్యభారాన్ని తన అల్లుడైన ధూమకేతుపై పెట్టడానికి పట్టాభిషేకం ఏర్పాటు చేశాడు.

ధూమకేతు పట్టాభిషేకానికి మంత్రులూ, సామంతులూ, సేనాపతులూ, ప్రజలూ హాజరై కొలువుతీరారు. జయజయధ్వానాలు చెలరేగుతూండగా, రాజు ధూమకేతు తలపై కిరీటంఉంచబోతూండగా, రాజగురువు వేదారణ్యులవారు వచ్చాడు. రాజదంపతులు భక్తితో ఆయనకు స్వాగతమిచ్చి వందనాలుచేశారు. రాజగురువు వారికి చంద్రదేవుడి ప్రసాదమైన పండొకటి ఇచ్చి పుత్రుడు కలుగుతాడని దీవించాడు. పట్టాభిషేకానికి భంగం కలిగింది. ధూమకేతు ధుమధుమలాడాడు.



రాజగురువు చెప్పిన ప్రకారమే రాణికి ఒక బాలుడు కలిగాడు. చిత్రమేమంటే బిడ్డ పుట్టినప్పుడే వాని మెడలో చంద్రహారం ఒకటి ఉన్నది. ఆ చంద్రహారంలోనే బిడ్డ పంచప్రాణాలూ ఉన్నాయనీ, దానిని మనుష్యమాత్రులెవరూ తాకలేరనీ, అయితే కుర్రవాడికి యవ్వనదశలో ఒక దివ్యశక్తి చేత గండమున్నదనీ, యుక్తవయసు రాగానే వివాహం చేసినట్టయితే ఆ గండం తొలగిపోతుందనీ రాజగురువు తెలిపాడు. కుర్రవాడికి చందనుడని పేరుపెట్టి వైభవంగా బారసాల చేశారు.

చందన్‌కు అయిదో ఏడు రాగానే మాలి వద్దకు పంపారు. వంశాచార ప్రకారం ఆ బాలుడు యుక్తవయసు వచ్చేదాకా మాలివద్దనే పెరుగుతూ, దేహపరిశ్రమ చేస్తూ, సామాన్య ప్రజలు తినే ఆహారమే తింటూ పెద్దవాడయాడు.

గురువుగారి ఆజ్ఞప్రకారం చందన్‌కు వివాహం జరిపించే ఉద్దేశంతో రాజుగారు అన్నిదేశాల రాజకుమార్తెల పటాలూ తెప్పించి, వారిలో ఎవరినో ఒకరిని వరించమని చందనమహలులో వున్న చందన్‌కు ధూమకేతుద్వారా కబురుచేశారు. అప్పటికే చందన్ ఒక సుగుణవతిఅయిన కన్యను ఊహించి బొమ్మ చిత్రించుకున్నాడు. అటు

వంటి కన్య దొరికితేగాని పెళ్ళాడరాదని నిశ్చయించుకున్నాడు. అయినా రాజాజ్ఞ ప్రకారం చందన్ మాలితోసహా రాజ సౌధానికి వెళ్ళి రాజకుమార్తెల పటాలన్నీ చూశాడు. ఒకటీ అతనికి నచ్చలేదు.

రాజుగారు మాలిని ఏకాంతంగా పిలిచి, అబ్బాయికి మరణగండమున్నదనీ, వివాహంచేస్తేతప్ప అది తొలగదనీ చెప్పారు. దానికి మాలి, అబ్బాయిగారొక ఊహ సుందరిని చిత్రించుకున్నారనీ, అలాటికన్య దొరికితేనేగాని పెళ్ళాడరనీ బైటపెట్టాడు. అట్లా అయితే అటువంటి కన్య ఎక్కడున్నా సరే వెతికి అబ్బాయికి వివాహం చేయించమని రాజు మాలిని కోరాడు. చందన్ దేశాటనకు ప్రయత్నాలు జరిగాయి.



రాజూ మాలీ అనుకున్న మాటలన్నీ దుష్టుడైన ధూమకేతు చెవుల పడ్డాయి. ఎట్లాగైనా చందన్‌కు పెళ్ళికాకుండాచేస్తే అతను చనిపోతాడనీ, అప్పుడు తనకే పట్టాభిషేకం జరుగుతుందనీ ఆశ పుట్టింది. అయితే పెళ్లికాకుండా చేయటమెలాగో ధూమకేతుకు ఎంతకీ పాలుపోలేదు. ఈ సమయంలో నిక్షేపరాయుడనేవాడు దేశదేశాలూ తిరుగుతూ ధూమకేతువద్దకు వచ్చాడు, ఘనకార్యాలు చేస్తానన్నాడు.

చందన్‌కు పెళ్ళి జరగకుండా చూసేటందుకు ధూమకేతు ఈ నిక్షేపరాయుణ్ణి నియమించాడు. అతనికి చందన్ చిత్రించుకున్న ఊహాసుందరి చిత్రం చూపెంచి, "ఇలాటి కన్య వాడి కంటపడకుండా చూడు," అని చెప్పి చందన్‌కు వెనకగా నిక్షేపరాయుణ్ణి ధూమకేతు దేశాటన పంపాడు.

దేశాటనలో ఒకనాడు చందనరాజూ మాలితోసహా ఒకచోట విడిసి ఉండగా నిక్షేపరాయుడు అతనివద్ద కొక సామంతరాజును పంపాడు. ఈ సామంతరాజు చందన్‌వద్దకు పోయి, ఆరాత్రి "చంద్రుడూ - కలవలు" నృత్యం ఏర్పాటు చేశామని చెప్పి చందన్‌ను ఆహ్వానించాడు. చందన్ మాలితోసహా ఆ రాత్రి నృత్యం చూసి, సంతోషించాడు. నృత్యం చేసిన స్త్రీలకు అతను బహుమతు లివ్వబోగా నిక్షేపరాయుడు అడ్డువచ్చి, వారిలో

ఎవరినైనా భార్యగా వరించమనీ, వారికదే బహుమానమనీ అన్నాడు. చందన్ ఆగ్ర హించి నిక్షేపరాయుణ్ణి పంపివేశాడు.

2

గౌరి చాలా సద్గుణవతి. ఆమె తండ్రి సీనయ్య ముసలివాడూ, జబ్బుమనిషీనూ. గౌరి తల్లి చిన్నతనం లోనే పోయింది. ఆమెను మారుతల్లి మరిడమ్మ పెంచింది. మరిడమ్మ గౌరిని నానా హింసలూ పెట్టేది. గౌరి ఈ బాధ లన్నిటినీ ఓర్చుకునేది. మరిడమ్మకు చిన్ని అని ఒక స్వంత కూతురు కూడా ఉన్నది. గౌరి ఎంత నిండుకుండో చిన్ని అంత ఓటికుండ; వట్టి వెకిలిమనిషి.



నిక్షేపరాయుడు ఈ గౌరి ఉండే గ్రామానికి వచ్చాడు. అతను బావివద్ద స్నానంచే స్తూండగా అక్కడికి గౌరి, బిందె చంకన పెట్టుకుని, నీళ్లకు వచ్చింది. గౌరిని చూడ గానే నిక్షేపరాయుడు నిర్ఘాంతపోయాడు. ఏమంటే గౌరి ముమ్మూర్తులా చందన్ చిత్రించిన ఊహాసుందరే! ఆమెను చూసి నట్టయితే చందన్ తప్పక పెళ్ళాడేస్తాడు! సందేహం లేదు.

గౌరి చందన్ కంట పడకుండా చూడ టానికి నిక్షేపరాయుడు ఒక ఎత్తువేశాడు. అతను మరిడమ్మను మంచిచేసుకుని, చిన్నిని చూస్తే చందన్ తప్పక పెళ్ళాడతా డని ఆశపెట్టి మరిడమ్మ ఇంటనే తన బసకూడా ఏర్పాటు చేశాడు.

అప్పటికే మరిడమ్మ గౌరి పెళ్ళి ప్రయత్నాలు కొంత చేసింది. మరి డమ్మకు ఒక అన్న ఉన్నాడు. ఆయనకు బుజ్జాయనే కొడు కున్నాడు. వాడు వట్టి వెర్రి బాగులవాడు. వాడికి గౌరినిచ్చి చేసే ఉద్దేశంతో మరిడమ్మ తన అన్ననూ, బుజ్జా యినీ పిలిపించింది. ఈ పెళ్ళి తనకిష్టంలేదని భర్త అంటే "దీని మొహానికి బుజ్జాయి కాక చందనరాజు రాబోయాడా?" అని హేళనచేసింది.

మరిడమ్మ ఈ పెళ్ళి జరిపించేలోపలనే చందనరాజు ఆ గ్రామానికి వచ్చాడు. ఆ రోజే గౌరి పుట్టినరోజు కూడానూ.

అందుచేత సీనయ్య గౌరి తల్లినగలుతీసి గౌరిని పెట్టుకోమన్నాడు. మరిడమ్మ ఏమను కుంటుందో అని గౌరి మొదట సంకోచిం చింది, కాని తండ్రి ప్రోద్బలంపైన పెట్టు కున్నది. ఇంతలోనే అమ్మ శక్తిలాగా వచ్చింది మరిడమ్మ. చిన్నిని చూడటానికి చందనరాజు వస్తున్నాడనీ, ఈ సంగతి తెలిసి తనభర్త నగలన్నీ గౌరికి పెట్టాడనీ గిలగిలా తన్నుకున్నది. గౌరి తన నగలన్నీ చిన్నికి పెట్టి అలంకరిస్తా నన్న దాకా ఆమె ఆరాటం తగ్గలేదు. చిన్నికి గౌరి నగలన్నీ పెట్టి ముస్తాబు చేసింది. చిన్ని చేతికి ఒక మాల ఇచ్చారు. ఆమెతోబాటు మరిడమ్మా గౌరీ వాకిట నిలబడి చందనరాజు కోసం ఎదురుచూడ సాగారు.



ప్రహరీగోడ వెనక ఉన్న చెట్టు మీదినుంచి వీథిలోకి చూస్తున్న నిక్షేప రాయుడికి తలవాకిట గౌరి కనిపించగానే కంగారుపుట్టింది. ఆమె చందనరాజు కంట పడితే ఇంకేమన్నా ఉందా? తన ప్రయత్న మంతా బూడిదలోపోసిన పన్నీరై పోతుందే. అందుచేత నిక్షేపరాయుడు పరిగెత్తుకుంటూ బయటికి వచ్చి తక్షణం గౌరిని ఇంట్లోకి తీసుకు పొమ్మన్నాడు మరిడమ్మతో. మరి డమ్మ గౌరిని లోపలికి లాక్కుపోయింది.

గుర్రాలమీద చందన్, మాలీ సమీపానికి వచ్చారు. దండ చేతబట్టి చిన్ని వారి దారికి అడ్డంగా నిలబడింది. దారి కడ్డం నిలబడ్డా వెందుకని మాలి చిన్నిని అడిగాడు. "స్వయంవరం దండ, వేయించుకోండి," అన్నది చిన్ని, చందన రాజుతో. తన ప్రజలు ఇంత నీచంగా ప్రవర్తిం చటం చూసి చందన్‌కు దేశాటనమీదనే విరక్తి కలిగింది. అతను ఆ క్షణమే తిరుగుముఖం పట్టి ఇంటికి వెళ్లిపోయా డు. ఈ విధంగా నిక్షేప రాయుడు వచ్చిన పని సానుకూల మయింది. గౌరి చందన్‌కంటపడకుండా చేశాడు. చందన్‌కు కన్యాన్వేషణమీద విరక్తి కలిగే టట్టుకూడా చేయగలిగాడు.

మరిడమ్మకు ఆశాభంగమయింది. నిక్షేప రాయుడు చిక్కులో పడ్డాడు. కాని యుక్తి గలవాడు కనక, సులువుగా తప్పించు కున్నాడు. పెద్దపిల్ల అయిన గౌరికి వివాహం కాకపోవటంచేతనే చిన్నిని చందనరాజు

వరించలేదనీ, ముందు ఆమె పెళ్లి జరిపిస్తే పీడలన్నీ వదలిపోయి కార్యం సానుకూల మవుతుందనీ చెప్పాడు. మరిడమ్మ బల వంతాన గౌరిని ఒప్పించి బుజ్జాయితో పెళ్లి ఏర్పాటుచేసింది. నిక్షేపరాయుడు చల్లగా జారుకుని ఇంటికి వెళ్ళాడు.

గౌరి అయితే బుజ్జాయిని పెళ్లాడటానికి ఒప్పుకుందిగాని ఆమె తండ్రి ఈ పెళ్ళికి ఎంతమాత్రమూ సమ్మ తించలేదు. తెల్లవారితే పెళ్ళిఅనగా ఆయన గౌరిని పిలిచి, ఆ రాత్రే ఇల్లు వదిలిపొమ్మనీ, ఈ వెర్రివాణ్ణి పెళ్ళాడి జీవితం నాశనంచేసు కునేకన్న ఎక్కడైనా హాయిగా బ్రతకమనీ చెప్పాడు. గౌరికన్నీటితో తండ్రిపాదాలు కళ్లకద్దుకుని కట్టుబట్టలతో ఇల్లువిడిచి ఒంటరిగా వెళ్ళిపోయింది.



3

అచలా, చంచలా అనే దేవకన్యలు అప్ప చెల్లెళ్లు. ఒక వెన్నెలరాత్రి వారు ఆకాశ మార్గాన విమానంలో పోతూవుండగా వారికి చందనవనంలో చందనరాజు కనిపించాడు. చంచల అప్పగారిద్వారా అతని ఊహ సుందరినిగురించీ, అతనికిగల మరణ గండాన్నిగురించీ విన్నది. చందనరాజుకు ప్రాణదానం చేసి అతను తనను వరించే లాగు చేద్దామని చంచలకు దుర్బుద్ధి పుట్టి, అప్ప వద్దంటున్నా వినక విమానందిగి చందనరాజువద్దకు వచ్చేసింది.

కాని చంచల కోరిక ఫలించలేదు. చందనరాజు చంచలను వరించలేదు. చంచ లకు కోపంవచ్చింది. ఆమె తన దివ్యశక్తివల్ల చందనరాజు మెడలోని చంద్రహారాన్ని లాక్కుని వెళ్లిపోయింది. చందన రాజు చచ్చి పడి పోయాడు.

చందనరాజు మృతికి తలిదండ్రులూ బంధు వులూ విలపించారు.

చంద్రహారం,ఎట్లాపోయిందో అట్లాగే తిరిగి వస్తుందనే ఆశతో రాజుగారు చందనరాజు శరీరాన్ని చందనమహలులోనే ఉంచి కాపాడుతూ ఉండమని మాలికి ఆజ్ఞ ఇచ్చారు.

మరుసటి రాత్రి చంచల మళ్ళీ చందన రాజువద్దకు వచ్చింది. అతన్ని బ్రతికిం చింది. తనను వరించమని కోరింది. చందన

రాజు నిరాకరించాడు. "నీ బుద్ధి మార్చుకునేటందుకు రోజూ అర్ధరాత్రి రెండు గడియలు ప్రాణం ఇస్తాను, ఆలోచించుకో!" అని హెచ్చరించి చంచల వెళ్ళిపోయింది.

తన శిష్యుడూ యువరాజూ అయిన చందన్ మృతికి విచారిస్తూ తన కుటీరంలో కూర్చునిఉన్న మాలి అకస్మికంగా చందన్ గొంతు విని ఆశ్చర్యపడ్డాడు. చూస్తే నిజంగా చందనరాజే! తన చందన్ బ్రతికినందుకు మాలి ఆనందానికి మేరలేక పోయింది. చందన్ మాలితో చంచల వృత్తాంతమంతా చెప్పి, ఈ చావు బ్రతుకుల మధ్య నుంచి తాను బయటపడేదాకా ఈ సంగతి ఎవరికీ చెప్పవద్దన్నాడు.



అక్కడ దేవలోకంలో అచలకు తన చెల్లెలు చంచల ప్రవర్తన ఏమీ నచ్చలేదు. మానవులతో పంతానికి పోవద్దనీ, చందన్ ప్రాణాలతో ఆడుకోవటం తగదనీ ఆమె చంచలకు చెప్పిచూసింది. కాని చంచల మూర్ఖపుపట్టు పట్టింది. అప్పుడు అచల తన దివ్యదృష్టితో చందన్ ఊహసుందరి కోసం చూసింది. ఇల్లువదిలిన తరువాత అనేక అడవులూ కొండలూ దాటి ఒకచోట స్పృహతప్పి పడిపోయిన గౌరి ఆమెకు కనిపించింది. వెంటనే అచల తన దైవ మాయచే అక్కడికి వెళ్లి గౌరిని చందన మహలులో చేర్చి అంతర్ధానమైపోయింది.

కొంచెంసేపటికల్లా చందనరాజు చావులో నుంచి మేల్కొన్నాడు. తన ఊహసుందరిని ప్రత్యక్షంగా చూశాడు. ఆమె చరిత్ర అంతా విన్నాడు. ఇంతలో మాలికూడా అక్కడికి వచ్చాడు, గౌరిని చూసి సంతోషించాడు. రహస్యమార్గాన ఊరివెలపల ఉన్న భద్రాలయానికి గౌరీ చందనులను తీసుకొనిపోయి అక్కడ వారిరువురకూ వివాహం చేసేశాడు.

ఈసంగతి తెలియగానే చంచల తుఫానులాగా వచ్చింది. చందన్‌పై మండిపడింది. గౌరి ఎంత వేడుకున్నా ఆమె మనసు కరగలేదు. ఆమె చందనరాజును దూషించి, అతను చందనవనం దాటి అడుగుపెట్టినట్టయితే శాశ్వతంగా ప్రాణాలు తీసేస్తానని బెదిరించి వెళ్లిపోయింది. గౌరి మాలికుటీరంలో దేవిని శరణుజొచ్చి ప్రార్థించింది.

ధూమకేతు అనుకొన్నప్రకారం చందన రాజు పెళ్ళి తప్పిపోయింది, అతను మర ణించాడు. కాని తనకింకా సింహాసనం రాలేదు. అందుచేత ధూమకేతు, నిక్షేప రాయుడి సలహాపై, సన్యాసివేషంతో మామ గారివద్దకు వెళ్ళి సన్యసిస్తున్నానని బెదరిం చాడు. రాజు గత్యంతరంలేక ధూమకేతు పట్టాభిషేకానికి ఒప్పుకున్నాడు. పట్టాభిషేకపు ఏర్పాట్లుచేసే భారం నిక్షేపరాయుడిపైనపడింది.



నిక్షేపరాయుడు పట్టాభిషేకం ఏర్పాట్లన్నీ పూర్తిచేసి, మాలలు కట్టమని చెప్పటానికి మాలి కుటీరానికి వెళ్ళాడు. అక్కడ మాలి లేడుగాని, దేవి ఎదుట ప్రార్థనచేసి సాష్టాంగపడిఉన్న గౌరిమటుకు కనిపించింది. ఆమెను చూడగానే నిక్షేప రాయుడికి ఎక్కడలేని కంగారూ పుట్టు కొచ్చింది. కింకరులను కుటీరం వెలపల కాపుంచి నిక్షేపరాయు డీవార్తను ధూమ కేతుకు చెప్పాడు. ఆమెను బంధించి పట్టుకురమ్మని ధూమకేతు నిక్షేపరాయుడికి ఆజ్ఞ ఇచ్చాడు.

ఈలోగా మాలి, నిక్షేపరాయుడి మూలంగా గౌరి ప్రాణానికి అపాయం కలగ వచ్చునని ఊహించి, ఆమెను చందనమహ లుకు తెచ్చి, అందులోని రహస్యమార్గం గుండా భద్రాలయంచేర్చి, ఇంతకాలం రహస్యంగా ఉంచిన వ్యవహారాలన్నీ రాజు గారికి తెలపడానికి రాజనగరుకు వెళ్ళాడు. అక్కడ ధూమకేతు అతనిని కొట్టి పడవే యించి గౌరి సంగతి తేల్చటానికి చందన మహలు దగ్గిరికి వచ్చాడు.

ఈలోపున కింకరులు నిక్షేపరాయుడుతో, మాలి గౌరితోసహా చందనమహలు ప్రవేశించినట్టు చెప్పారు. చందనమహలు ఎంత గాలించినా వారి జాడ దొరకలేదు. ఇంతలో ధూమకేతు వచ్చాడు. మాలిని తాను కొట్టి పడేయించా ననీ, గౌరి చందనమహలులోనే ఎక్కడో దాగివుంటుందనీ, చందనమహలుకు నిప్పంటించితే, గౌరి పీడా, చందనరాజు

పీడా వదిలిపోతుందని చెప్పాడు. నిప్పు కోసం కింకరులు మాలి కుటీరానికి వెళ్ళారు.

ఈ కింకరులు వట్టి పరమానందయ్య శిష్యులు. వీళ్ళు నిప్పుకోసం పెట్టెలలోనూ, బుట్టలలోనూ, బట్టలలోనూ వెతికారు. దేవి విగ్రహంపద్ద దీపాలుంటే వాటి సహాయంతో మరీ వెతికారు! వారికెక్కడా నిప్పే కని పించలేదు!

ఇంతలో మామూలు ప్రకారం చందన్ బ్రతికి లేచాడు. తిన్నగా మాలి కుటీరానికి వెళ్ళాడు. అక్కడ గౌరిగాని మాలి గాని లేకపోవడం చూసి భద్రాలయానికి పోయి ఉంటారని ఊహించి రహస్యమార్గంగా అక్క డికి బయలుదేరాడు. ఇదంతా చాటున వుండి చూస్తున్న ధూమకేతు, నిక్షేపరాయుళ్ళు అతని వెనకగా భటులతో బయలుదేరారు.



తన ఆజ్ఞ నుల్లంఘించి చందన్ భద్రా లయానికి రావడం చూసి చంచల మండి పడి వచ్చి, శాశ్వతంగా చంద్రహారం పుచ్చు కుని చందనరాజును చంపి వెళ్ళిపోయింది. ఆలయంలో ఉన్న గౌరి బయటికి వచ్చి చచ్చి పడిపోయిన భర్త కోసం శోకింప సాగింది. ఈ సమయంలోనే అక్కడికి ధూమకేతు నిక్షేపరాయుళ్ళు వచ్చారు. పంచాయితీ చేశారు. గౌరి రాక్షసి అనీ, ఆమే చందన్‌ను చంపిందనీ, అతనిని తిన డానికి ఊరిబయటికి ఈడ్చుకువచ్చిందనీ అన్నారు.

తాను చందనరాజు భార్యననీ, దేవ కన్యక అతని ప్రాణాలు తీసిందనీ గౌరి చెప్పింది. కాని వారు వినిపించుకోలేదు. రాజ్యంకూడా కాజేద్దా మని ఇలా అంటున్న దన్నారు. తక్షణమే చందనరాజు శరీరానికీ, దానితోబాటు సజీవంగా గౌరికీ దహనక్రియలు జరపడానికి ఉత్తరు విచ్చారు.

తననుమాత్రమే దహించమనీ, అలాచేసినట్టయితే దేవకన్య తన భర్తను బ్రతికిస్తుందనీ గౌరి మొరపెట్టు కున్నది. కాని చందన్ బ్రతకటం వారి కిష్టంలేదు. అందుచేత కట్టెలు పట్టుకు రావడానికి కింకరులను పంపారు. మూఢు లైన కింకరులు గట్టుమీది చిట్టిగూడెం పోయి అక్కడివారందరినీ కట్టెలతోసహా రమ్మని ఆహ్వానించారు. అందరూ బయలుదేరారు.

గుట్టుగా పనిముగింతామనుకున్న ధూమకేతు ఈ జనాన్నిచూసి భయపడ్డాడు. కాని నిక్షేపరాయుడు అతనికి ధైర్యంచెప్పి వచ్చిన జనాన్ని గౌరి రాకసి అని నమ్మించాడు.

ఆమే చందన్ ప్రాణాలు తీసిందనీ, రాత్రింబగళ్ళు పరిశోధన చేసి తాము ఈ రాకసిని పట్టుకున్నామనీ, ఈ అర్థరాత్రి ఈ రాకసి చందన్ శరీరాన్ని తినటానికి ఊరి బయటికి లాక్కువచ్చిందనీ కూడా నిక్షేపరాయుడు ప్రజలకు చెప్పాడు.



చితి పేర్చారు. దాని మీదికి గౌరినీ చందనరాజు శరీరాన్నీ ఎక్కించారు. తనకు తోడ్పడే మానవమాత్రు లెవరూ లేక పోవటంవల్ల గౌరి చితిపై నిలబడి తన ఇష్టదైవమైన లోకమాతనూ, వేల్పులనూ ప్రార్థించి ఈ అన్యాయం సరిచేయమన్నది.

ఈసమయంలో ఇంద్రలోకంలో ఇంద్రాది దిక్పాలకులు వైభవంగా కొలువుతీరి ఉన్నారు. అచలా, చంచలా, ఇతర అప్సరలూ నృత్యం చేస్తున్నారు. వారికి గౌరి ఆర్తనాదం వినిపించింది. అందరి మొహాలా చంచలపట్ల క్రోధం తాండవమాడింది. మిగిలిన అప్సరలు చంచలను వదిలి దూరంవెళ్లారు. చంచలకు తీరని పరాభవమూ పతనమూ కలిగింది. మానవులతో పంతానికి పోయి రాకసిలాగా ప్రవర్తించినందుకు ఇంద్రుడు ఆమె మహిమలన్నిటినీ తీసివేశాడు. ఆమె ఇంద్రుడి పాదాలవద్ద వాలి ప్రాయశ్చిత్తంగా చంద్రహారాన్ని చందనరాజుకు పంపేసింది.

చితిమీద చందనరాజు లేచికూర్చున్నాడు. చూసేవారి కందరికీ విస్మయం కలిగింది. ధూమకేతు నిక్షేపరాయుళ్ళు ఈసమయంలో తప్పించుకు పారిపోవటానికి యత్నించారు. కాని లాభం లేకపోయింది. దెబ్బతిన్న మాలి తేరుకుని రాజదంపతులనూ పరివారాన్నీ భద్రాలయానికి తెచ్చాడు. ధూమకేతు నిక్షేపరాయుళ్లు దొరికిపోయారు. రాజు వారి పశ్చాత్తాపాన్ని ఆమోదించి, అంతా విధివిలాసంగా స్వీకరించి, వారిని శిక్షించకుండా వదిలేశాడు.

చందనరాజుకూ, గౌరికీ పట్టాభిషేకం జరిగింది. వారు చాలాకాలం ప్రజలను కన్నబిడ్డల్లాగా పాలిస్తూ సుఖంగా ఉన్నారు.

పంతులుగారు చెప్పిన ఈ "చంద్ర హారం" కథ విని పిల్లలందరూ చాలా ఆనం దించారు. ఈ "చంద్రహారం" చిత్రం మీ వూరు వచ్చినప్పుడు మీరుకూడా చూసి ఆనందించండి.

ఇందులో కడుపుబ్బ నవ్వించే హాస్యం ఉంది. బుజ్జాయి చదువు పిచ్చి, "ఎంత చెబితే అంతగాళ్ళు" అయిన కింకరుల అయోమయమూ, నిక్షేపరాయుడుచేసే ఘన కార్యాలూ చూసి మీరు ఆనందిస్తారు. గౌరి పడే కష్టాలు మీకు ఎంతో జాలికలిగిస్తాయి. ఆకాశమార్గాన దేవకన్యల ప్రయాణాలూ, ఇంద్రలోకమూ చూసి మీకు అంతులేని ఆశ్చర్యం కలుగుతుంది. ఈ చిత్రంచూసి మీరొక చక్కని నీతికూడా నేర్చుకుంటారు:

అదృష్టవంతుణ్ణి చెడగొట్టేవాడు లేడు.

దురదృష్టవంతుణ్ణి బాగుచేసేవాడు లేడు.



Photo by D. I. Chanthamian



బహుమతి
పొందిన వ్యాఖ్య

పాటులో మూట

పంపినవారు :
సి. పద్మావతి—కర్నూలు

